# మీరాబాయి

( ఆఱుఅంకముల నాటకము )

గ్రంథకర్త:

బాలకవి, శతావధాని

బ్రహ్మశ్రీ నూకల సూర్యనారాయణమూర్తిగారు.

పబ్లిషర్సు:

**కాళహస్తి తమ్మారావు అండు సన్సు**

ప్రింటర్సు, పబ్లిషర్సు, అండు బుక్సెల్లర్సు, రాజమండ్రి.

1945

ప్రథమ ముద్రణ
500 కాపీలు

కాళహస్తి తమ్మారావు అండు సన్సువారి
స్వకీయ శ్రీరాజేశ్వరీ ప్రెస్‌నందు
ముద్రించబడియె—రాజమండ్రి





మూల్యం
రూపాయి పావులా

*






ఈ నాటకమును ముద్రించుట, ప్రదర్శించుట, స్క్రీనుచేయుట రికార్డు తీయుట వగైరాలు మా వ్రాతపూర్వకమైన అనుమతి లేనిదే, ఎవరును చేయరాదని యిందుమూలముగా తెలియజేయుడమైనది. ఈ నియమములు అతిక్రమించినవారు మేము చేయు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

ఇట్లు,
కాపీరైటు హక్కుదార్లు
కాళహస్తి తమ్మారావు అండు సన్సు,
రాజమండ్రి.

# ఇందలి పాత్రములు.



## పురుషులు

రాణాకుంభుడు :—కథానాయకుడు.

జయమల్లుడు :—మీరాతండ్రి.

దయానందుడు :—యోగి

మదనసింగ్ }
పృథ్వీసింగ్ } వార్తాహరులు.

శివనాథభట్టు }
సదానందుడు } పౌరులు.

కామిశెట్టి :—

## స్త్రీలు

మీరాబాయి :—కథానాయకురాలు.

సీరాబాయి :—మీరాజనని.

సుగుణాబాయి :—మీరా ఆడబడుచు.

నళిని :—మీరాచెలికత్తె.

సుందరమ్మ :—

వృద్ధురాలు :—భిక్షుకురాలు.



శ్రీరస్తు.

# మీరాబాయి

## ప్రథమాంకము.

మొదటి రంగము—రాచనగరులో వైష్ణవమందిరము.

(ప్రవేశము—పాండురంగనామసంకీర్తన మొనరించుచు దయానందయోగి—అనుబంధము—1)

దయా:—(స్వగ) ఆహా! భోగభాగ్యములు, శ్రీమంతులునగు క్షత్రియుల గర్భమున నుద్భవించియు, బదియాఱువత్సరములైనఁ బైఁబడకముందే, విజితేంద్రియులగు మహామునులకు సైతము దుర్లభంబులగు భక్తివైరాగ్యముల సముపార్జించుకొని, మూర్తీభవించిన సద్గుణపుంజమేయనఁ దనరుచున్న మీరాబాయి, హిందూసుందరీమణులకెల్ల మార్గదర్శినిగదా! అక్కన్యాజన్మముచేత క్షత్రియకులమెల్లఁ బునీతమైనది—తల్లిదండ్రులగు వీరాజయమల్లులు ధన్యులైరి. రాథోరు రాజవంశమెల్ల నామెను జూచి గర్వింపవలసినదే!

సీ. మందాకినీ దివ్య • మందవీచికలందు
లలిఁ దూఁగు నాయిందు • కళలభాతి
గ్రీష్మకాలోద్భవ • పుష్పసౌరభయుక్త
వనవీథిఁ జరియించు • పవనుఁబోలె

మీ రా బా యి

సాంధ్యరాగాంచిత ♦ సౌందర్యవిస్ఫూర్తిఁ
ప్రకటించు మేఘమా ♦ లికలపగిది
చూతఖాదనమునఁ ♦ జొక్కునకలకంఠ
కంఠనిర్గత ప్రాంశ్య ♦ గానమట్లు
గీ. భళిర! సుందరంబును, సుఖ ♦ ప్రదముఁ గాంతి
మంతమును, మధురమ్మునై ♦ భక్తురాలి
తనువు—సద్వర్తనంబును ♦ దర్శనంబు
పాటయు నమరి, జనసుతుల్ ♦ పడయుఁగలుగు.

ప్రజలెల్లరు నామెయొక్క సచ్చరితంబును గాథలుగ వాకొను చుండఁ బలుమారు లాకర్ణించితిని. సామాన్య స్త్రీచందమున నామె పేదసాదలతోఁగలసి, విఠలదేవుని భజించుచు వీథులఁ బడి పోవుచున్నపుడు ప్రత్యక్షముగఁ జూచితిని. కాని, నే నింత వరకు నామెతో ముచ్చటింపలేదు. తఱువాతనే, యామె యీ భజనమందిరమునకుఁ బ్రార్థనసేయవచ్చునని తెలిసికొని, యామెతో సంభాషించు నుత్సాహముతో నరుదెంచితిని. (కొంచెమాగి) అదే! రాచనగరులోని మంగళవాద్యమ్ములు వినఁబడుచున్నవి. (ఆకసమువంకఁ జూచి) సూర్యోదయకాల మాసన్నమయినది. అప్పుడే పురవీథులందు నందదులెట్లుక్రందు కొన్నవో! భాస్కరాగమనము ప్రజలలో నెంతసంచలనముం బుట్టించుచున్నదో!

సీ. కానుక లర్పింపఁ ♦ గాఁబోలు! గొల్లలు
పాలకుండలతోడఁ ♦ బయనమైరి!
మేల్కొల్పు గీతముల్ ♦ వినిపింపఁ గాఁబోలు!
పక్షులు తమగూండ్లు ♦ బాయుచుండె!

సుదతులు కాంచరోలు! ♦ చూడ వేడుకపడి
చెలువుగట్టులపైని ♦ జేరినారు!
స్వాగతంబీయంగ ♦ వాంఛించిరా(?)రోలు!
తమ్మికుంపులవెల్లఁ ♦ దలలనెత్తె!

గీ. ప్రాగ్దిశాంగన నోముల ♦ పంటయనఁగ
సూర్యుఁ డాకసంబునఁ బొడ ♦ సూపినంత
జనుల కోలాహలంబులు ♦ వంతరల్లె
జగము మేల్కాంచెఁ జీకటుల్ ♦ సమసిపోయె.

భక్తురాలగు మీరాబాయి యింకను దృగ్గోచరముగా లేదు. నిద్రనుండి పెందలకడనే యామె లేచునని వినియుంటిని—నేఁడీ భజనమందిరమునకరుదెంచుటలోఁ దడయుట కేమికారణమో! (ఇంచుక సేపాగి) అహా! నే నెంతపుణ్యాత్ముఁడను! మూర్తీభవించిన భక్తిరసమో, లేక యిలకవతరించిన భారతియోయనఁ దనరుచు, మంజులమధురాలాప మొనరించుచు నిటు వచ్చుచున్న యా సుందరీమణియే మీరాబాయి!

చ. కమల దళాంచితంబులయి ♦ కాంతులనీనెడు కన్నులందు శాంతము తోఁచుకాడ-భక్తికి-ని ♦ ధానముగా వెలుఁగొందుమోమునం దమరఁగ మందహాసము-ల ♦ తాంతములం గొనివచ్చునామె-గానము మధురమ్మౌ, శ్రావ్యమును ♦ నవ్యమునై విననయ్యెనియ్యెడన్

సాధుసందర్శనము సకలభాగ్యప్రదముకదా!

(అంతఁ జేతఁ బూలసెజ్జను బట్టుకొని, మీరాబాయి ప్రవేశము.)

మీరా:—(దయానందు నుద్దేశించి, తనలో) ఆహా! ఏమి నా భాగ్యము! నేఁటితో నా నోములు ఫలించినవా? నా జన్మ తరించి

నదా? గతరాత్రి స్వప్నమున రంఛోడదేవుఁడు సాక్షాత్కరించి, "యచిరకాలములో సద్గురుపాదసంసేవాభాగ్యము నీకుఁ బ్రాపింపఁ గలద" ని నుడివెను. ఆ గురుదేవుఁ డీతఁడేకాబోలు! (ప్రకా) ఓ భక్తాగ్రగణ్యా! దాసురాలిదే భక్తిపురస్సరముగాఁ బ్రణమిల్లు చున్నది—అనుగ్రహింపుఁడు. (అని పూలసెజ్జను గ్రిందఁబెట్టి నమస్కరించును.)

దయా:—పాండురంగ పాదారవిందసేవాసద్భాగ్యప్రాప్తిరస్తు. కుమారీ! మీరా! తెలువాతనే యిటకువచ్చి, నీ దర్శనముకొఱకు వేచియున్నాను.

మీరా:—మహాత్మా! ఈ దాసురాలిమీఁద నిర్హేతుకకరుణాశయమును వ్యక్తపరచిన భక్తశేఖరులగు మీ వృత్తాంతము వినుటకు హృదయము వేగిరపడుచున్నది. అనుగ్రహింతురా?

దయా:—అమ్మా! నేనొకసన్యాసిని. నన్ను "దయానందుఁడ" ని యెల్లరు వ్యవహరింతురు. బాల్యముననే పరమేశ్వరానుగ్రహమున భక్తివైరాగ్యము లలవడఁజేసికొని, పుణ్యక్షేత్రములం గ్రుమ్మరుచు నేనెఱింగినసూక్తులను బ్రజలకు బోధించుచుఁ గాలము వెళ్ళఁబుచ్చుచున్నాను నే నీ మార్వారుదేశమునకువచ్చి మాసము దినములయినది. నీ పవిత్రచరిత్రమును బ్రజలమూలమున విని, నిన్నుఁ జూచి, నీతో ముచ్చటింపఁగోరి యిపు డిటకు వచ్చితిని.

మీరా:—మహాత్మా! యోగిపుంగవా!

మ. పరలోకాంచిత నిత్యసౌఖ్యమె మదిన్ ♦ వాంఛించి, సంసారమున్
బరివర్జించి, విరాగివై, వినుత స ♦ ద్భక్తాగ్రగణ్యుండవై
పరమాత్ముండగు పాండురంగని సదా ♦ ప్రార్థించుచున్నట్టి నీ
వరుదేతెంచి దరియించె నీ గృహము-నే ♦ నానందముం బొందితిన్.

సాధుసందర్శనము-సకలార్థసాధనము-దురితహరణము-సంతోషప్రదము అని పెద్దలు చెప్పుదురు.

దయా :—తల్లీ! యౌవనవతివగు నీకీ భక్తివైరాగ్యము లలవడుట పూర్వజన్మమునఁ జేసిన పుణ్యవశమున నైయుండును. మహారాజపుత్రివయ్యు, వెలగల వలువలఁ గోల్లక, యాభరణములను ధరింపక, భోగలాలసవుగాక, నిజుపేదకైనడ సామాన్యవస్త్రములను ధరించి, పాండురంగ పదారవింద సేవామృతాస్వాదనాసక్త చిత్తవయిన నీ చరితము సర్వజనసంకీర్తనీయముగదా!

మీరా :—స్వామీ! దయానందా! తనువులు క్షణభంగురములు, బుద్బుదప్రాయములు-యౌవనము ఝురీవేగతుల్యము, మరణమనివార్యము - నిత్యము - నిర్మలమునగు జీవనముగోరువారిహలోకవాంఛలకులోనుగాను, సుఖములకు ముందంజవేయరు భోగములకాశక్తింజెందరు మీరెఱుంగని పరమార్థమేమున్నది. ? యోగివరేణ్యా!

సీ॥ వసియించుటకునవ్య ♦ ధర్మ్యహర్మ్యము లేల ?
ఈయదే భూరుహ ♦ చ్ఛాయసుఖము
ధరియించుటకుఁ జాగు ♦ తరభూషణము లేల ?
తనరి వే నవలతాం ♦ తములు మేన!
ఆరగించుటకయి ♦ క్షీరాన్నమదియేల ?
తృప్తినందెడ పండ్లు ♦ తినఁగబొట్ట!
శయనించుటకుఁబూల ♦ శయ్య లేవలయునా ?
చాపరాబండలు ♦ చాలవొక్కొ!
గీ. మరణమాసన్నమైనప్డు ♦ మనుజుఁ డోకఁడె
చనెడు గ్రహచారముండ, సం ♦ సారమేల!
శాశ్వతముకాని జగతి సం♦ చారమేల ?
సర్వలోకేశు మరచి వి ♦ చారమేల ?

దయా :—(తనలో) ఆహా! అప్సరసలకుఁగూడ దుర్లభం బగు మహాశాస్త్ర విజ్ఞానసంపద యీమె కలవడినదికదా! (ప్రకాశ) కుమారీ! మీరా! నీపలుకులు విజ్ఞానశోభితములుఁ సత్యసమన్విత ములు - సర్వజన సమాదరణీయములు. నీభక్తి ప్రశంసార్హము.

మీరా :—దేవా! జన్మసాఫల్యము నడయుటకు భక్తియే కదా ప్రధానము! నిశ్చలభక్తి భావముతో - భవపాశమునఁ జిక్కు వడక, భగవంతునిభజించు - పవిత్రులే చరితార్థులుగదా!

దయా :—అమ్మా! నిజము - నీవు చెప్పినదెల్ల నిజము

మ. జనసంబంధినదాది మాపవుఁడు దా ♦ సాఫల్యమాశించుచోఁ
దనువుల్ బుద్బుదసన్నిభంబులని స్వాంం ♦ తంబందు భావింపుచున్
దనయిల్లంచును, వాకిలంచును వృధా ♦ తాపత్రయంబూన కా
ఘనహా కేశవనామ సంస్మరణముం గాంక్షించి చే మాఁదగున్.

మీరా :— దేవా! తావకీయ దివ్యబోధసుధ నాస్వాదించి, ధన్యనైతిని. నేఁటినుండి నాకు మీరుగురువులు - మీ యుపదేశాను సారముఁగ వర్తించుటయే నాముఖ్యధర్మమని విశ్వసింతును.

దయా :—పుత్రీ! నీవు నాశిష్యురాలిగ నంగీకరించుట నా భాగ్యమే! కాని, నేనొక తావుననుండు వాఁడంగానుగదా! ఈదినమున నీపురమం దుంటిని - రేపు చిత్తూరునకుఁ బయనముగా నున్నాఁడనుఁ కనుక నీకును నాకును నెల్లప్పుడు నొక ప్రదేశమునఁ గలిసికొనుటకు వీలు చిక్కదు. విజ్ఞానఖనివగు నీకితరు లుపదేశించుట కేమున్నది? అయినను మనసున నన్నాచార్యునిగా భావించితివి కావున - నిత్యా నందనంధాయకమగు, పాండురంగని దివ్యచరణారవిందముల నెల్ల ప్పుడు నిదేవిధమున భజింపుమని యుపదేశించుచున్నాను. ఆ శ్రీరంగ భజనకుఁ దుల్యమగునది వేఱొండు లేదు.

సీ॥ కలుషంబు సడలించి ♦ కైవల్యమిచ్చును
పాండురంగని దివ్య ♦ పాదభజన!
భవభీతిఁబోఁగొట్టి ♦ భక్తితత్వము నేర్పుఁ
బాండురంగని దివ్య ♦ పాదభజన!
ఖేదంబుసడలించి ♦ మోదంబు ఘటియించుఁ
బాండురంగని దివ్య ♦ పాదభజన!
అవివేకమును మాల్చి ♦ సువిచారమొసఁగును
పాండురంగని దివ్య ♦ పాదభజన!
గీ॥ అట్టిదానిని శ్రద్ధమై ♦ నబల! నీవు
సతతముసేయుచు సత్కీర్తి ♦ సంతరిల్ల,
వర్ణనాతీత సంతోష ♦ వార్ధిఁదేలి
స్త్రీలలోకెల్లను శిరోమౌచుఁ ♦ వెలుఁగుమమ్మ!!

మీరా:—(దయానందుని పాదములఁబైఁబడి) స్వామీ! అజ్ఞానవశంబున సంసారాంధకార కూపంబునఁబడి నశింపకుండ, నన్నుద్ధరించితిరి. మీయుపదేశమును దలఁదాల్తును. వివాహము నొల్లను. భవబంధములచేఁ గట్టువడను. భర్తయయినను, కర్తయయినను, హర్తయయినను నాకా విఠల దేవుఁడే!

దయా:—(లేవదీసి) కుమారీ! మేలు మేలు! ఆజన్మాంతము బ్రహ్మచారిణివై, లోకహితార్థము, శక్తివంచనలేక పాటుపడుచుండుము. ఇంక నేఁ బోయివచ్చెదను. నాకనుజ్ఞయిమ్ము.

మీరా:—గురుదేవా! తమ దర్శనభాగ్యము మరల నీదాసురాలి కెప్పుడు లభించును?

దయా:—కుమారీ! నేను రేపు చిత్తూరునగరమునకుఁ బోవుచున్నాను. అటఁగల వేణుగోపాలస్వామిని సందర్శింపవలయునన్న కుతూహలముగలదు. ఆప్రదేశము వీడి యెక్కడికేఁగెదనో—యిపుడు

చెప్పఁజాలను. కాని, నిన్నుఁ జూచుటకై తప్పక యెప్పుడయిన నిటకు వచ్చెదను. నామాటను విశ్వసింపుము.

మీరా :—గురుదేవా! విఠలదేవుని కొఱకు నేనీ పుష్పములం గైకొని తెచ్చితిని. నేను వీనితో నమ్మహాత్ముని బూజించుచుందును. భక్తిభావసమ్మిళితమగు మనోహరగీత మొండు పాడిన పిమ్మట మీరేఁగవలయునని నాప్రార్థన.

దయా.:—అమ్మా! అట్లేకానిమ్ము. (అనుబంధము 2)

(మీరాబాయి మందిరములోని పాండురంగ విగ్రహముపైఁ బూవులనిడిన పిమ్మట - దయారాముఁడు పాడు గీతము ననుసరించి భజనసేయుచుండఁగాఁ దెరవ్రాలును)

---

రెండవరంగము—అంతఃపురము.

(ప్రవేశము- చేతనొక లేఖంబట్టుకొని జయమల్లుఁడు)

జయ :—(లేఖను జదువుటలబినయించి-తనలో)ఆహా! ఏమి నాభాగ్యము! సర్వవిధములఁ దమతో సమానులగు వారితోడి నెయ్యమును, వియ్యమును-సాధారణముగా నమకూడుననుట నేనెఱింగినవిషయమే! చిత్తూరు మహారాణాయగు కుంభుఁడే స్వయముగా నాపుత్రికను-మీరాను(దన సహధర్మచారిణిగాఁ జేసికొనుతలంపుతో నాయంగీకారముంగోరుచు, నీలేఖను బుత్తెంచినాఁడు. ఇంక నాలసింపనేల? పట్టమహిషితో ముచ్చటించి యనుకూలమగు ప్రత్యుత్తరమువ్రాసిపంపెదను. (ప్రక్కకుఁజూచి) అదిగో! దేవియు నరుదెంచుచున్నది. ఆమె నడిగినయెడలఁ గొమరితయొక్క మనోగతాభిప్రాయముకూడ విదితమగును.

(అపుడు వీరాబాయి ప్రవేశము.)

వీరా :—నాథా! చిత్తూరు రాణాయొద్దనుండి మీ కేదియో లేఖ వచ్చినదని వింటిని. అందలివిషయమే నెరుంగఁదగినదా ?

జయ :—ప్రేయసీ! మాటలోనికే వచ్చితివి. లేఖయందలి యంశములనుగురించి నీతో ముచ్చటింపఁదలచితిని — నమ్మి — ఇటుల గూర్చుచుండుము.

వీరా :—(ఆసీనురాలై) సెలవిమ్ము.

జయ :—దేవీ! మన మీరాకు — యుక్తవయస్సు వచ్చినది కదా! అనన్య లావణ్యాతేజోవిరాశియు — నిరుపమాన విద్యావతియు నగు నామెకు వివాహ మొనరించు టవసరముగదా!

వీరా :—నాథా! ఆమెకు పెండిలికిఁదగిన యీడే వచ్చి నది. వివాహమునుగూర్చి ప్రస్తావించునపుడెల్ల నామె వింతగా ముచ్చటించుచుండును.

జయ :—వార్ధకమ్మున బొందదగిన భక్తి వైరాగ్యము లామె బాల్యమందే పొందినది యౌవనమందుఁగూడ నట్లే యున్నది.

వీరా :—రాచకులమునఁబుట్టిన యాడువారిట్లుండుటకు వీలా ? వయస్సువచ్చుటతోడనే—సుక్షత్రియవంశసంజాతుండగు నుత్తమపురు షుని బరిణయంబాడకున్న, లోకము సమ్మతింపదుకదా !

జయ :—వివాహమన్న నామె కయిష్టమా ? లేక, కాలక్షేప మగు తన భక్తిప్రవాహము నది యరికట్టునని తలఁచుచున్నదా ?

వీరా :—ఆమె తలంపేదియో నాకు తెలియదు—కానీ వటుకే పరమాత్మండగు పాండురంగని ప్రదికరణశుద్ధిగాఁ ప్రేమించి పెండ్లియా డినదఁట! ఈ మధ్య నెవ్వరో యొకయోగి— "పరిణయమాడి భవ పాశములఁ దగులువడకుమ" ని యుపదేశించినాడఁట. అందుచేత రం

ఘోడదేవుఁడే తనకు భర్తయఁట! ఇట్లు పలుకుచున్న యామెకు సమాధానము చెప్పుట కెవ్వరితరము?

జయ :—(విచారముతో) అక్కటా! చిత్తూరు మహారాణా యగు కుంభుఁడు భార్యగా నామెను బడయఁగోరి, నాకీ లేఖను వ్రాసినాఁడు. ఆమె యిప్పట్ల మూర్ఖతను విడువకున్న నెట్లు?.........

భగవన్నామసంకీర్తము వినఁబడుచున్నది! ఆమెయే కాఁబోలు నిటు వచ్చుచున్నది.

వీరా :—మీరే, ఆమెతో సంభాషింపుఁడు. పెండ్లిలింగూర్చి తన యభిప్రాయమేమని చెప్పునో విందము.

జయ :—మంచిది అట్లే యగుఁగాక!

(అంత భగవన్నామస్మరణ మొనరించుచు మీరాబాయి ప్రవేశము.

(అనుబంధము —4.)

వీరా :—అమ్మా! మీరా! నీవు సమయమునకే వచ్చితివి. తండ్రిగారు నీతో నొక ప్రధానాంశమునుగూర్చి మాటాడఁగోరుచున్నారు.

మీరా :—తల్లీ! నాన్నగారు - నాతోఁ బ్రస్తావనసేయునంతటి ప్రధానాంశ మేమున్నది?

జయ :—కుమారీ!

సీ. నిజ యశశ్చంద్రికల్ ♦ నిఖిల దిక్కులు నిండ
కలనేలిన మహీ ♦ పాలవరులు
మగలాయి రాజులన్ ♦ మత్తేభములఁ జెండు
సింగంపుఁ గొదమలై ♦ చెలఁగునృపులు
ప్రథిత భారతదేశ ♦ స్వాతంత్ర్యమాశించి
పేరునిల్పిన మహా ♦ ధీరగుణులు

ఆలంబునందున ♦ నపజయుంబెఱుఁగక
వీరసద్మముఁగొన్న ♦ మేటిబలులు
గీ నగుచు వర్ణింపనేరికి ♦ నలవికాని
కీర్తిఁగాంచినారు—చి ♦ త్తూరువారు!
వారిలో నగ్రగణ్యుఁడై ♦ వాసిఁగన్న
కుంభుఁడే నిన్నుఁ బత్నిగాఁ ♦ గొనఁదలంచె!

నీవు—మాకు లేక లేక కలిగినబిడ్డవు. సర్వవిద్యల నభ్యసించితివి—సద్గుణముల నలవడఁజేసికొంటివి—యుక్తవయస్సు ప్రాపైఁబడుటచే—క్షత్రియోచితంబగువిధమునఁ బాణిగ్రహణము చేసికొనవలయును. ఏ పూర్వపుణ్యావశంబునఁ దగినవరుండు లభించినాఁడు.

మీరా:—(నవ్వుచు) తండ్రీ!

సీ॥ సమ్మోహనంబగు ♦ జలజనాభునిమూర్తిఁ
గాంచిసుఖించెడు ♦ కనుల జంట
మహిమాన్వితములైన ♦ మాధవులీలలఁ
ముప్పొద్దుస్మరియించి ♦ మురియుజిహ్వ
పాండురంగని దివ్యపాదారవిందంబు
లతిభక్తిసేవించు ♦ హస్తయుగము
ఏకాగ్రబుద్ధినై ♦ శ్రీకృష్ణతత్వంబు
నెఱుఁగయత్నించెడు ♦ హృదయకుహర

గీ॥ మన్యపురుషునిజూడంగ ♦ వానిఁబిలువఁ
గొలువఁదెలియంగ మదిలోనఁ ♦ గోరవెపుడు;-
వినుతవీణారవంబులఁ దనియు చెవులు
కాఁకిమూఁక కేకలవినఁ ♦ గడగునొక్కొ!

వీరా :—అమ్మాయీ ! నీకుఁగల భగవద్భక్తి మాకమందా నంద సంధాయకమే ! కాని- నీవుచూపుచున్న వివాహవైముఖ్యము మాత్రము సంతాపసంజనకము.

మీరా :—తల్లీ! నేనీవఱకేఁ నాహృదయము నా పాండురంగ నికి సమర్పించితిని. అభగవంతునియందే నాదృష్టి కేంద్రీకరణమైనది. అట్టిదాని నిప్పుడు మరల్చుటకు సాధ్యమా ? సింగపుం గొదమహస్తి మస్తమస్తిష్కముఁగోరుఁ గాని- తృణవితానములతోఁ దృప్తినందదు కదా ! లలితమృణాల పల్లవంబుల నభిలషించు రాయంచచేఁపపిల్లలం జేరదుగదా ! పాండురంగ నామామృతాస్వాదనాసక్తమగు చిత్తము పరచింతకుఁ దావీయదుగదా ! నీవెఱుంగని విషయము లేమున్నవి ?

వీరా :—మీరా ! ధర్మపథముదప్పుట నిన్నుఁబోలిన సుగుణవతుల కుచితమా ?

మీరా :—నేనిందుఁ దప్పిన ధర్మమేమున్నది ? పాండురంగని ద్రికరణశుద్ధిగఁ బ్రేమించితిని. ప్రేమించినవానినిగాని యన్యుని జేబట్టవచ్చునా ? అట్లు చేఁబట్టిన నిహమున, జిత్తశాంతియుండదు, పరమన నిత్యానందము ప్రాప్తింపదు. ఆత్మనొకని కర్పించి, దేహము నింకొకని కిచ్చుట ధర్మమా ? అయ్యది క్షత్రియాంగనల కర్హమా ?

జయ :—అమ్మాయి ! నీవు మహాభక్తురాలవై, పరమేశ్వరుని పదపంకజములను మనసుననిల్పి, సేవించుట శ్లాఘాపాత్రమే ! అస్మదాదులకది సంతోషకరమే ! కాని- పురుషునింబోలె నా జన్మాంతము బ్రహ్మచర్య మవలంబించియుంట తప్పుఁ.

మీరా :—తండ్రీ! నీవునన్ను మన్నింతువేనిఁ చెప్పుచున్నాను- నేనవివాహితనై, యా శ్రీమన్నారాయణుని దివ్యనామామృతముం గ్రోలుచు - నందనందనుని పాదారవిందముల నమందానందముతో

సేవించుచు - లోకకల్యాణసంధాయకమగు ప్రజాసేవలనఁ బ్రొద్దు పుచ్చుటయే తప్పయిన - దేహధారులొనరించు తప్పులకిఁక లెక్క-యుఁడదు—

సీ॥ అజ్ఞానమనఁబడు ♦ నతివగర్భమునందుఁ
బిండమై చీములో ♦ నుండఁ దప్పు
తదుపరిమాయయన్ ♦ ధరణిపై లింగభే
దముఁబొంది శిశువౌచుఁ ♦ దనరఁదప్పు
తనరిసకలకష్ట ♦ జనక సంసార సా
గరమునఁబడిమున్గి ♦ కలఁగఁదప్పు
కలఁగియుఁగైవల్య ♦ కారణంబైన శ్రీ
హరినామపఠనంబు ♦ మరువఁదప్పు

గీ॥ మరచి మదినిఁ బశ్చాత్తాప ♦ వహ్నిరగులఁ
దనువు బూటకమంచు స్వాం ♦ తమునఁ దెలిసి
సర్వసంగ పరిత్యాంగ ♦ సరణినరసి
కోరి హరినిగొల్వకయుంట ♦ గొప్పతప్పు !

నా కనుజ్ఞయిండుఁ రంఛోడదేవుని మందిరమునకు స్వామి దర్శనార్థమై భక్తులు వచ్చువేళయయినది. నేనుఁబోయి వారిని సత్కరింపవలయునుఁ

(నిష్క్రమించును.)

పీరా :—నాథా ! ఇఁక మీరా రామె కేమని బోధింతురు ? కిటి కేసరి శార్దూల గండభేరుండ ప్రభృతభయంకర మృగాలవాలం బగు దుర్గమారణ్యంబులకేఁగి, అందుఁ గందమూలములం దినుచు, ఎండ వానలకోర్చి, యుగ్రతపంబొనరించు - జడదారులకేని యిట్టి వైరాగ్య ముండదు.

జయ :—అకటా ! ఇపుడేది కర్తవ్యము ?

ఉ॥ కుందుదునా? అనూజతన • కం గల నిశ్చయమిట్లు తెల్పి-తా
సుందర గాత్రుడైన పురు • షుందగఁ బెండిలి కొల్లకుంట చే—
మందర శైల ధారు మతి నుని • భక్తి నినిల్పి భజింప, నేమువం
బందుదునా? యింకేమిగతి? • ఆర్యుల మెత్తురె యీమె చర్యలన్ !

పోడమినది రాచకులము. అగ్నిహోత్రము వంటిది. ప్రాణముం బరిత్యజించియు - మానముం గాపాడుకొన వలసి యున్నది. లోకము పాపపూరితము. లోకులు నీటిలో నిప్పును బుట్టింతురు. అది యుంగాక - ఉత్తమసంబంధము సమకూడినది. ఈమె "మా జన్మాంతమవివాహితనై యుందు" ననుచున్నది. ఇప్పుడు చిత్తూరు రాణా కేమని ప్రత్యుత్తర మంపువాఁడను? (ఆలోచన మభినయించుచున్నాడు)

వీరా :—రాధా! మీ రిట్లు వ్యాకులమంద నేల? లోనికి దయచేయుఁడు. తరువాత కర్తవ్య మాలోచింపవచ్చును.

జయ :—మంచిది అటులొనరింతును,

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

---

మూఁడవరంగము—విఠోభాదేవుని మందిరము

(ప్రవేశము-పూజాద్రవ్యములతో మీరాబాయి)

మీరా :—(అనుబంధము 5)

(విగ్రహమునకుఁ జందనాదులర్పించుచు) రంగా! శుభాంగా! పాపభంగా!

గీ॥ ప్రవిమలంబైన నీమూర్తి • ప్రతిమయందు
గోచరముగాఁగ మదిలోన • గుతుకమొదవె-

కోటి బ్రహ్మాండములు గూడఁ ♦ గుక్షినున్న
ఘనుఁడ! పక్షిస్వరూపాన ♦ గ్రాలినావె?

ఓ నందనందనా! భక్తమందారా! అచంచలభక్తితో ననవరతము నిన్నే స్మరించుచుందునుగదా! నీమందస్మిత సుందర వదనారవిందమును గన్నులారఁ జూడఁ గోరుదునుగదా! ఉల్లము పల్లవింపఁ ద్వదీయ పదపంకజములఁ గొలుతుఁగదా! నాకేల సాక్షాత్కరింపవు? స్వామీ! దీనబంధూ! కృపాసింధూ! నేను మాత్రము పవిత్రహృదయనుగానా? నాకుమాత్రము భక్తిలేదా? నిన్నుఁజూచి సంతోషించు నదృష్టమును నేను మాత్రము నోచుకొనలేదా? రంగా! పాండురంగా! ఆలసింపకుము. రమ్ము-రమ్ము దర్శన మొసంగుము. నాఁడు సభలో దుష్టకార్యారంభుఁడగు దుశ్శాసనుఁడు కోకలు విప్పుచుండ-ద్రౌపదిపయిం జల్కిన నీదయారసము - ఉక్కుకంబమునం దుద్భవించి, ప్రహ్లాదు బ్రోచినపుడు వ్యక్తపఱచిన నీ వాత్సల్యము - దూర్వాసుని గర్వము సర్వము ఖర్వముసేసి యంబరీషుని యెడఁ జూపిన నీయాదరణము- మకరినింబరిమార్చి కరిరాజుం గాచుటలోఁ గనఁబఱచిన నీకరుణ—తండ్రీ! నాయెడల మాత్రమేల ప్రకటింపవు? వారు కన్నులారఁ గాంచిన నీదివ్యమంగళ స్వరూపమును నేను మాత్రము చూడరాదా? నీకొఱకై శ్రమపడి సుగంధద్రవ్యములెన్నో తెచ్చితిని. నామ్రోల సాక్షాత్కరించి వీనిని స్వీకరింపుము. నన్నుఁదరింపఁ జేయుము...... శ్రీహరీ! నిర్వ్యాజకృపాలహరీ! మాటలాడవేమి? మాఱుపలుకవేమి? నాపైఁ గోపమా? లేక నిరాదరణమా?......
కాదు-కాదు నీవే నా సర్వస్వమని నమ్మికొనియున్న నాపై నీకు నిరాదరణముండదు. (సవిత్కారముగ) నిరాదరణమే కాకున్న నాకు దర్శన మొసంగవేల? నాకుబదులు చెప్పవేల? నేనర్పించు చందనాదులం గైకొనవేల? పండరినాథా! కార్యాంతర నిమగ్నుండవై నామొఱను

లెక్కచేయకున్నావా ? లేక, పదియారువేల గోపాంగనల కైకైక నాయకుండవుగదా ! వారిలో నేపుణ్యాత్మురాలైన నిన్నుఁ దనబిగియు కౌఁగిటఁబట్టి యెందుఁబోవలదని బంధించినదా ?......... ఆఁ ఏమి నా వెఱ్ఱి ! ఏమి నా బుద్ధిహీనత ! నిశ్చలభక్తి పాశబంధితుండవగు నీవు— అన్యపాశములకుఁ జిక్కవనుమవా ? చిక్కనడవు... అయిన నాయాహ్వనము నంగీకరింపవేల ? (కొంచెమాఁగి) ఆహా ! అదియా సంగతి ! తెలిసినది—రంగా ! తెలిసినది. నేనుగొని తెచ్చిన పూజా ద్రవ్యములు చాలవని యలిగి రాకయున్నావు. స్వామీ ! ఇప్పుడే పోయి నీకు సంతృప్తియగునట్లు వలసినన్ని సుగంధ ద్రవ్యములు-పూల దండలు - ఫలహారములు గొని తెచ్చెదను. అప్పు డెవ్వరి కోసరము వత్తువు ? ఇంకే వంక పెట్టెదవు ? ఏరీతిని దప్పించుకొందువు ? పోయె దను-అచిర కాలములోనే, వానిని దెచ్చి నీ మ్రోలఁ బెట్టెదను-సాక్షాత్క రింపఁ గోరెదను. నీపవిత్ర సందర్శనలాభముంబొంది—సఫలమనో రథనై తరించెదను. (నిష్క్రమించును)

---

(ప్రవేశము—కామిశెట్టి—సుందరమ్మ)

కామి :—నూసినావా ? అమ్మోరినాగ తల ఇరగపోసికొని తక్కెడిసిచ్చినాగ గుండ్రంగా మొగమ్మీద పట్టెడుకుంకం బొట్టెట్టు కొని యిప్పుడే మెల్తుంది—రాసోరిబొట్టి. ఈ మందిరం, రాజుతో సెప్పి ఆమె కట్టించిందే ! అదుగో అతగాడేకామూను రంఛోడుదేముడు— మొక్కుదాం—రా.

సుంద :—ఏమని మొక్కుదాం ?

కామి :— సుందరం! నే నేటి మొక్కుతానో, నీకు సెప్ప మన్నావా?

సుంద :—చెప్పు—చెప్పు

కామి :— "సామీ! మా రాజా! మా సుందరం నాకు మూడోపెళ్లి పెళ్ళాం—నేను ముసలోణ్ణి—అది పదఃసుది—నల్లగా జీడి పిక్కలాగ—మాలకాకిలాగ—మసిబొగ్గులాగ వున్నా దానివొళ్ళు నిగ నిగలాడేటట్టు సెయ్యి—పాత బెల్లంలాగ— ముడతొక్కిన సింతపండునాగ దాని తలమీదెంటుక లట్టకట్టినా, కొబ్బరినూనిమ్మని నా పాణాలులాగ కండా వుండేనాగ సెయ్యి—నాకు పగలు శక్తి లేకపోయినా—రాత్తిరికాడ బలం బాగాయియ్యి—నా వొళ్ళు కంపుకొట్టినా—నా పెళ్ళాని కదిమంచి గంధంనాగ—వాకతికరుపూరంనాగ — జాజిమొగ్గనాగ గుమ్మనిపించే టట్టు వరమియ్యి—ఇతర సావుకార్లు నచ్చినా—యీ కామిసెట్టిమాత్రం— పిల్లలతోటి—పాపలతోటి—ధనంతోటి—దాన్నంతోటి — మేకలతోటి— మాన్నాలతోటి సుక్కల్లో పందురుడలాగ అభివృద్ధి పొందేటట్టు సెయ్యి—నీవు గనుక నా కొక్కపాళి యిన్ని వరాలిచ్చేసినావంటే— అమ్మగా మిగిలితే చెక్కమీదరాలే బెల్లంపొడంతా నీదే! నీ మనసు నయివేద్దిగానికి లోటుండదు.

సుంద :—దరిద్రుడా! దేముడికాడికొచ్చికూడా యెదవకోరి కలే—మొగుడువయితే అయినావుగాని సుగం మండపెట్టాలని వుం టాది. బత్తి దయసెయ్యమని అడుక్కోకూడదూ?

కామి :— యెర్రిమొగమ! బత్తి బత్తంటావు? ఎందుకే? దానివల్ల అన్నంవొత్తాదా? బట్టొత్తాదా? రాసోరిబొట్టి—(ఇటు నటుం జూచి) యెవ్వరు నేరుగందా! కత్తిమీది సాము—రాసోరుబొట్టి మీరా

బాయమ్మ మొగుడొద్దు—పెళ్ళొద్దు—అంటోంది ? ఈ మందిరం కట్టించి రాతిరికాడ యిందులో తొంగుంటోంది—ఎంచేత ? నికేటి తెలుసు?

సుంద :—బగవంతుడుమీాది బత్తిచేత !

కామి :—యెర్రిమొగమ ! యెర్రిమొగమ ! అదికాదు. అసలు సంగతి—మొగుడయితే, సచ్చినంతకాలం వొక్కడితోటే దేవులాడాలి బత్తిఅని వొంకెడితే యిట్టమొచ్చిన మొగుణ్ణి రాతిరు లిక్కడికి రప్పించుకోవచ్చును—బోగం అనబగించొచ్చును. అని తెలిసిందా ?

(అంత నాకస్మికముగాఁ దెరలో)

చ॥ " ఎవఁడవురోరి ! మూర్ఖ ! పృథివీశునిపుత్రికఁ బూతగాత్రినిన్
బ్రవిమల భక్తియుక్త నన • వద్యచరిత్రను—లోకమెల్ల సం
స్తవ మొనరించుచుండఁగ మ • దమ్మున నీ గతిఁ బల్లదంబులం
దవిలి, వచించుచుంటి వసి • ధారను నీ తలఁ ద్రెళ్ళ నేసెదన్. " .

కామి :—(ఆలకించి భయముతో మెల్లఁగ) ఓ లమ్మో ! ఇంకేటిసేతు నింకేటిసేతును ? రాయే—కొంపమునిఁగిపోనాది. నా మాట లెవ్వడో యిన్నాడు—రావే.

సుంద :— నోటివట్టం కూడదని నేను సెప్పితే యిఁటావా ? గుడీ నూడొద్దు—మందిరం సూడొద్దంటే తీసుకొచ్చావు—మొదట పిల్లీ-తరువాత బోడిబాపనమ్మో ఎదురయినారు.

కామి :—(గడగడవడఁకుచు) రాయే. రాయే. బతికిబయట పడితే అంతేచాలు. (అని భార్యను తీసికొని పఱుగెత్తును.)

(అంత " నెవఁడవురోరి మూర్ఖ " యను పద్యముం జదువుచుఁ గత్తిం జేతఁబట్టుకొని మదనసింగు ప్రవేశము.)

మదన :—ఓరోరీ ! గర్వాంధకారచిత్తా ! అధమాధమా ! ఏమిరా ప్రేలుచుంటివి ? మహారాజపుత్రికయగు మీరాబాయినే దుర్భాషలాడుచున్నావుగా ? ఎంతసాహస మెంతసాహసము ! (నలు వంకలం జూచి) అన్నన్నా ! ఎంతప్రమాదము వాటిల్లినది. కర్ణశూలములగు నా కఠోరవాక్యములాడిన మూర్ఖాత్ముం డెవ్వఁడో యింతలోనే—తప్పించుకొని పోయినాఁడు ! ఇపుడేదిగతి ? ......... అయ్యయ్యో ! ఎంతదారుణమునకు నెట్టుకొనెను ! సుక్షత్రియవంశమునందుద్భవించి, మార్వారు దేశాధీశున కగు జయమల్లు నంతటివానికనుంగు బిడ్డయై—బాల్యముననే సకలశాస్త్రముల నభ్యసించి—భగవన్నామస్మరణమునకు - అన్యచింతలు లేక పరమభక్తురాలై, యోషిజ్జనదీపికయై హిందూసుందరీమణులలోం దలమానికమైయున్న మీరాబాయికిట్టి యపవాదా ? అగ్నికణములను జెదపురుగులు దరియుటా ? బంగారు వెలవెలం బోవుటా ? అభ్రగంగలోం బంకిలమా ? అమృతభాండములో దుర్వాసనా ? హా ! ఎట్టి విషాదకరమగు విషయము! పరమభక్తురాలికిం బ్రణతులుపోయి—పరుషములా ! ప్రతిభాన్వితయగు కాంతారత్నమునకుం బ్రసూనములుమాని. దుర్భాషలా ? (కోపముతో) ఛీ! ఛీ! ఏలనా శౌర్యము ? ఏలనాధిపత్యము ? కాల్పనా ? రంఛోడదేవుని మందిరమునకు వచ్చి-గర్వాంధుండై యుక్తాయుక్త విచక్షణజ్ఞానశూన్యుండై భక్తురాలినట్లు దూషించిన దుర్మార్గుల శిక్షింపలేక పోయితినిగదా ! .........హరహరా ! ఆమెకుం దుచ్ఛమగు కామేచ్ఛయే యున్నం బెండిలిసేసికొనదా ? పెండిలిసేసికొన్న, భర్త తన స్వేచ్ఛావిహారమునకు నిరోధముం గల్పించునని మానివేసినదఁట! అబ్బా—దుర్భరము ! ఈకఠినవార్త రాజేంద్రుం డెఱింగిన నేమి కీడు మూడునో ! (సాలోచనముగ) కీడున కేమున్నది ? నామరూపములు లేని దుష్టుండెవ్వఁడో యేమో ప్రేలినాఁడని—అవియెల్లవిశ్వసించునా ?

విశ్వసింపఁడు. మీఁదు మిక్కిలి యాదుర్మార్గుఁ డెట్టియున నేను గుఱుతు పట్టిన, వానికిఁ దప్పక తగిన శిక్షగాఁ గలదు. కనుక నేఁబోయి మహారాజునకీ వృత్తాంతము తెలియఁ జేసెదను (ప్రక్కకుఁదిరిగి) కంచుకీ! మహారాజుగా రిప్పుడెక్కడనున్నారు? (వినుటనభినయించి)ఆఁ! ఏమనుచుంటివి? "చిత్తూరనుండి లేఖంగొని తెచ్చిన వానితో సభా భవనమున ముచ్చటించు చున్నార"నియా? మంచిది. వారినక్కడ సందర్శింతును. (నిష్క్రమించును.)

తెర వ్రాలును

ప్రథమాంకము—సంపూర్ణము.

శ్రీరస్తు.

# మీరాబాయి

## ద్వితీయాంకము.

### మొదటి రంగము—సభాభవనము.

(ప్రవేశము—జయమల్లుఁడు)

జయ :—(తనలో) చిత్తూరు రాణాయగు కుంభునకు ద్వరలోనే తన వాంఛిత మీడేరఁగలదని లేఖ వ్రాసి పంపితిని— ఈలోపున నెట్లయినఁ గొమరితను బెండ్లి కంగీకరింపఁజేయవలయును— ఈమె నాతఁడు గాఢముగఁ బ్రేమించియుండవచ్చును. లేఖం గొని తెచ్చిన వానిమాటలనుబట్టి చూడఁగా— రాణా మీరాబాయియొక్క యద్వితీయసౌందర్యమునుగుఱించి కర్ణాకర్ణికగా వినియున్నాఁడని తెలియుచున్నది............ మదనసింగు వచ్చుచున్నాఁడు. పురములోని విశేషము లెఱుంగవలయును.

(ప్రవేశము—మదనసింగు)

మదన :—జయము జయము మహారాజుగారికి.

జయ :—మదనసింగూ! రమ్ము—నేఁడు పురములోని వార్తలం దెలిసికొనుటకుఁ బోయితివా?

మదన :—మహాప్రభూ! నేఁడు మన నగరులోనున్న విఠోబా దేవునాలయములో నొక దుర్భరమగు వార్తను వినియుంటిని. అది మొదలు నా హృదయము కుమిలిపోవుచున్నది.

జయ :—(ఆత్రముతో) ఏమి ? ఆ వార్త ! ఎవరినిగురించి ?

మదన :—దేవా ! విషయ మటువిస్మృటఁ దెలిసికొనవచ్చును, ముందా దుష్టుని గురించి, తగినట్లు శిక్షించుటకు నాకనుజ్ఞయిండు.

జయ :—(సవ్యంగము) బాగు బాగు ! ఆ వార్త యేదియో—అది సత్యమో—అసత్యమో – ఎవరినిగూర్చినదో – ఎందులకుఁ బుట్టినదో— ఎవరు దానికిఁ గర్తలో-ఏమియుఁ దెలుపుటకుముందే యపరాధుని దండింపఁగోరుచున్నావా ? అది సమంజసమా ? నేరస్థుని దెలిసికొనకుండ నేరమెఱుంగకుండ నీకనుజ్ఞ యిచ్చుటెట్లు ?

మదన :—దేవా ! ఆ వార్త కేవలమసత్యము. మీరద్దాని నాలింపుఁ రేని మహోగ్రులయ్యెదరు నేరస్థునిగురించి పట్టుకొన లేదని నా శిరమును సైతము ఖండింపఁగడంగుదురు.

జయ :—మదనసింగూ ! సంతరాఁ భయుపడనవసరము లేదు దుర్భరము న సత్యమునగు నా వార్తయెట్టిదో ముందు నా కెఱిగింపుము.

మదన :—మహారాజా ! పరమభక్తురాలగు మీరాబాయి—

జయ :—(ఆస్తోక్తిలో నఁ మూతురతతో) ఆ,. చెప్పుము-ఆలసింపకుము-పరమభక్తురాలగు మీరాబాయి—

మదన :—దుశ్శీలయనియు, పరభిప్రాయముతో నా జన్మాంత నువివాహితయైయుండుటకుఁ గోరుచున్నదనియు, గంభోడ దేవుని జూడ వచ్చిన దుష్టుఁ డెవ్వఁడో ప్రసంగవశమునఁ బ్రేలినాఁడు.

జయ :—(చెవులు మూసికొని) శ్రీహరీ !

మదన :— ప్రభూ ! కంఠస్వరమును బట్టిచూడఁగా నాతఁ డెవ్వడో వైశ్యాధముఁడనుట నిశ్చయము. కావలివాండ్ర నడిగి నేనా దుష్టుని దెలిసికొని, మదీయకరవాలంబుచే, వాని మాంసమును గృధ్రముల కాహారమగునట్లు చేసెదను.

జయ :—(నిమీలితనేత్రుండై నిట్టూర్పు బుచ్చి) హరహరా!

మదన :—(తనలో) ఈ వార్త యిమ్మహాత్మునకుఁ గర్ణవిభీషణమైనది. (ప్రకా) ఏలిక యింకను శాంతించెద రేల?

జయ :—మదనసింగూ! నీవు మాటలు కూడాడక పోయి, యంతఃపురమునందలి చెలికత్తెతో, దేవిని నేఁ జూడఁగోరుచున్నానని యామెకుఁ దెలుపుమని చెప్పుము.

మదన :—చిత్తము.

(నిష్క్రమించును)

జయ :—(నేలఁ గూలఁబడి) హా మీరా! మీరా! దుర్భరము దారుణము! నే నికఁ బ్రాణములతో నుండఁజాలను-విశ్వవిఖ్యాతమహామార్వారుదేశమున కధిపతినై-సుప్రసిద్ధ రాథోరువంశసంజాతుండనై-దిగంతవ్యాప్తకీర్తికవిశుండనై-యున్న నా కిట్టి యపవాదా? హృదయకుఠారము-కర్ణకఠోరము నగు నీ వార్త-అబ్బా!-అయ్యో!-శరీరమును గంపింపఁ జేయుచున్నది.

సీ॥ కలికిఁ గత్తినిబూని ♦ కండకండలుగాఁగ
మాంసమ్ముఁ జెండాడ ♦ బాధయునను
భగ్గుభగ్గునమండు ♦ మంటలోపలఁద్రోసి
తనువు వ్రేల్చిన మదిఁ ♦ గినియఁబోను
శత్రుచాపవిముక్త ♦ సాయకంబులుడాసి
క్షతగాత్రునిగఁజేయ ♦ సైపగలను
సలసల మఱగెడు ♦ సలిలభాండమునందు
ముంచి నన్నుడికింప ♦ మునుగ నెపుడు

గీ॥ అకటకట! సర్వగీర్వాణ ♦ మకుట ఘటిత
మణిగణాలంకృత విమల ♦ పాదపద్మ

పాలితంబగు స్వర్గసం ♦ ప్రాప్తి నిచ్చు
యశముఁ జెఱుపఁగ దుఃఖంబు ♦ నందుచుంటి.

ఇఁక నాకు గత్యంతరమేమి? ప్రాణమున్నంతవఱకే పగతురుపైఁబడి పీడింతురు-భూతము లావేశించి బాధించును. రోగములు జనసత్త్వములఁ దూలించి కాటియఁ బెట్టును-కాని దుర్యశఃపిశాచమట్లు కాదు. ఆసేతుహిమాచలపర్యంతము వ్యాపించి యాచంద్రతారార్కము తన కెరయయిన మందభాగ్యులి నొంచుచుండును......హా! మీరా! మందభాగ్యుండనగు నాకు నీ వేల జన్మించితివి? అభ్రగంగాజలంబు వలెఁ బ్రఖ్యాతమై-ఐరావతమువలె సమున్నతమై-శారదపూర్ణిమాచంద్రికవలె ధవళమై-దిక్కుల నలముకొనిన నా యశస్సునకు నీవు కళంక మాపాదించితివి. అక్కటా! పుట్టినది గౌరవమాశించు రాచకులము-పట్టినది వీరోచితమగు ఖడ్గము-మెట్టినది పవిత్రంబగు భరతఖండము! అయిననేమి? జనాపవాదమున కీరీతిని గుఱియయితిని. ఇపుడు నాకు కర్తవ్యమేమి? అట్లు కొమరిత శీలమును శంకించిన దుష్టునిబట్టి దండింతునా?......అది యేటిధర్మము? ప్రజాభిప్రాయము ననుసరించి పాలించినవాఁడే రాజు-తన్నుఁ బొగడిన సంతసించి-తెగడిన శిక్షింపఁ దలకొనుట నరపతి కనుచితము. పూర్వము రఘుకులభూషణుండగు రామచంద్రుఁ డేమిచేసినాఁడు? పతివ్రతాశిరోమణిని దుర్భరజనాపవాదకుజడిసి-భయంకరాటవిని విడువఁబంపలేదా? ఆగ్రహించి తన భార్యం దూలనాడినవాని తలను దెగవేయఁ బూనినాఁడా? లేదు-కాఁబట్టి దుర్భాషలాడిరనితలంచి-ప్రజలను హింసించుట యపఖ్యాతికి హేతువు! నిజమునకు వారిదోసమేమున్నది? యుక్తవయస్కయయ్యు వివాహ మొనరించుకొనకుండుట నా కొమరితయొక్క-కాదు-కాదు-ఆ మీరాయొక్క లోపముగాదా? శుద్ధాంతఃపురములలో నెందకన్నెయుంగక, మనవలసిన యువతి-సామాన్యస్త్రీచందమున స్వేచ్ఛావిహార

ములుసేయుట దోషముగాదా? లోకులంటిరని వారిం దెగడనేల? (కొంచెమాగి) ఆఁ, ఏమి? మీరా-నా ముద్దులబిడ్డ-పరమభక్తురాలు-నీ గనుకొనునంతటి దుశ్శీలయా? అంతటి దుష్కార్యారంభయా? కాదు-కాదు - ముమ్మాటికిఁగాదు. నే నా మాటను నమ్మఁజాలను. (కత్తిదూసి) మహారాజపుత్రియని తలంపక- మంచిచెడ్డ లాలోచింపక యిట్టి యపవాదులాడిన యీ దుర్మార్గుని యమపురికిప్పుడే పంపెదఁగాక! (కొంచెమాగి) అయ్యో! నే నెంత తెలివిమాలినవాఁడను-ఎట్టి బుద్ధిహీనుఁడను-తనకుఁదోచిన యభిప్రాయమును లేక, తా నెరిఁగినవిషయమును స్పష్టమొనరించినంతమాత్రమున నాగ్రహించి-వానిం జంపఁ గత్తి దూయనేల? ఈ కత్తితో . నా కుత్తుకనయినఁ గోసికొందును-లేకున్న నపయశం బుదుగుటకై యీమె కుత్తుకనయినఁ దరిగెదను-(దుఃఖించుచు) హా! ఏమంటిని? నా మీరా కుత్తుకను దఱిగెదననియా? అకటా! నే నెంతదుర్మార్గుడను! ఎట్టికఠినాత్ముఁడను?-ఎవ్వఁడో యనామకుఁడు-తెలిసో - తెలియకో-ఏమో ప్రేలినాఁడని-లేక లేక పుట్టినకూఁతును - చక్కదనాల బొమ్మను - గుణాలకుప్పను - ముద్దులమూటను - మంచిచెడ్డలు విచారింపక, కటికవాడనై సంహరింపఁబూనితినా? హా! పుత్రీ! నీ స్వభావమెఱంగియుండియు, నీ యెడల నిట్టి యపచార మొనరించుటా? (కొంచెమాగి) ఇపుడు నాకుఁ గర్తవ్యమేమి? (భగవంతు నుద్దేశించి) హా! దైవమా! ఎట్టి విషమావస్థను గల్పించితివయ్యా! ఇటుఁజూచిన కూఁతురా? అటుఁజూచిన దుర్యశము నకు మనమున భయమా? ఒకమూలఁ గన్నకడుపా? వేఱొకవంకఁ బ్రాణాధికంబగు మానమా? ఇపుడిందులో నేది నాకు వాంఛనీయము? (సాలోచనముగ) పుత్రికయే వాంఛనీయము - ఆమెను క్షేమించి - ఆఁ, కాదు - కాదు - నేను పొరఁబడుచున్నాను. మానమే నాకు వాంఛనీయము. అయినఁ గూఁతు నేమిసేయుదును?- (ఆలో

చించి) విషమిచ్చి చంపి యపవాదమును బాపుకొందును. హా! ఎంత దారుణము! తాను పెంచిన వృక్షమును దానే ఖండించుటా? తండ్రి నయిన నేనిట్టి కార్యము నాచరింపగలనా? ఆచరింపకున్న దుర్యశము తప్పునుగదా! (ఆలోచించి) వలదు - వలదు - దుర్యశముమాత్రము వలదు - కొమరితనుమాత్రమే కాదు - నా సర్వరాజ్యమునైనం గోల్పోయెదను - నా ప్రాణములనయినం త్యజింతును. కాని దుర్యశమును భరింప లేను ఓ జనాపవాదమా! నీ కిదే జోహారు! నీకు భయపడి యేకైకపుత్రికను బలిగా నర్పింతును - స్వీకరింపుము - అంతటితో తృప్తిబొంది నన్ననుగ్రహింపుము - నేటితోడను దుర్యశం బెట్టిదో యెఱుంగను - ఇంకమీఁదమాత నుడివేల? (కూఁతు నుద్దేశించి) మీరా! మీరా! నీవు నిష్కళంకహృదయవనియే నా యభిప్రాయము - కాని, నే నేమి సేయఁగలను? ప్రజలు నిన్ను శంకించుచున్నారు నీకుఁగలిగిన యపవాదము నీతోడనే యంతముగావలయును. కనుక విష మొసంగి నిన్ను............అక్కటా!...... మోహమా! పొమ్ము - నీకు నా హృదయమునందావు లేదు. అయ్యది పాషాణసదృశము. వాత్సల్యమా! అరుగుము. ఆలసింపవలదు. నీవు నా యాదృతి నీకఁ బడ దుఃజాలవు. ఓ ప్రజలారా! రఘుకులభూషణుండగు రామచంద్రుని - ఆదర్శపురుషునిగఁ జేకొని - మీరు దుశ్శీల - జా-రి-ణీ-యని భావించుచున్న నా కొ-మ-రి-కాదు-మీరాబాయిని విషమిచ్చి చంపి తీరెదను. నమ్ముఁడు - నా మాట నమ్ముడు. (అని మిన్నకుండును.)

(అంత విచారగ్రస్తయై మీరాబాయి ప్రవేశము.)

మీరా:—(స్వగ) అక్కటా! ఎట్టి దుర్భరవార్త కల్పింపఁబడినది. ఇది విన్నది మొదలు నాథుని మనస్సెట్లున్నదో! నాతో ముచ్చ

టిం బంపఁదలంచి కాఁబోలు వెంటనే రావలసినదని నా కాజ్ఞాపించిరి... ... ప్రాణేశ్వరుఁడదే మొయిలునరకిన తరువువలె నేలఁ గూలఁబడియుండెను. ముఖలక్షణములం బట్టి చూడఁగా వ్యాకులమనస్కుఁడై యున్నట్లు తోఁచుచున్నది. (భర్తను సమీపించి) దేవా! ఏల దీ... ... ... ...

జయ:—(మోము త్రిప్పి చూచి) వచ్చితివా? (కొంచెమాగి) నీ వీ విషయము నెఱుంగవు కాఁబోలు!

మీరా:—(కన్నీరుఁగార్చుచు) నాథా! మీకు నన్నింత తొందరగాఁ బిలువనంపుటకుఁ గారణమేమని మదనసింహుని కడకుఁ జెలికత్తెను బంపితిని. అతఁ డామెకు సర్వము చెప్పఁగానే నాలకించితిని... ... ... అక్కటా! ఎట్టిదుర్భరజనాపవాదము వాటిల్లినది? నిర్మలయశస్సునకు గళంక మాపాదిల్లినదే! ఆ సేతుహిమాచల మీ వార్త వ్యాపించుటే కాక—ఆ చంద్రార్కము నిలిచియుండునుగదా!

జయ:—

గీ॥ అమృతకిరణముల్ ప్రసరించు ♦ నట్టిరాజు
ప్రజలచేఁ గళంకితుఁడనఁ ♦ బరఁగుఁగాక!
కాని—మా గ్వాసుదేశంబు ♦ ఖ్యాతి నేలు
రాజు తాఁ గళంకితుఁడౌనె? ♦ రాజవదన!

మీరా:—నాథా! రాఠోరువంశజుండైన జయమల్లునకుఁ బట్టమహిషియగు మీరాబాయికి జనించిన కొమరిత దుశ్శీలయని ప్రజ తరతరములవరకుఁ జెప్పుకొనుచుందురుగదా! మీరాబాయి యుక్తవయస్సున వివాహము గావించుకొని యంతఃపురంబు వీడకుండిన, మనకిట్టి యపవాదము వచ్చునా?

జయ:—ప్రాణేశ్వరీ! లోకములో దుర్యశమునకు గుఱియగుట హేయము. ప్రాణము పోయినఁ బోవుఁగాక! మానము రక్షిం[illegible]

లయును. ఈ నా నుడివిను. మీరాతోఁబుట్టిన యపకీర్తి మీరాతోనే యంతరింపవలయును.

మీరా :—నాథా! మీ మాట నాకు బోధపడుట లేదు.

జయ :—బోధపడుట కేమున్నది? దుర్వ్యాళ మంటువ్యాధివంటి దికదా! దానికిఁదగిన నివారణోపాయ మాలోచింపవలదా?

గీ॥ వ్రణముపుట్టిన వ్రేలిని ♦ త్వరితగతిని
శస్త్రసాహాయ్యమునుబొంది ♦ సాహసించి:
చెండకున్నచో, మేనెల్లఁ ♦ జెడునుగాదె!
వ్రేలిఁ గోల్పోవలేక, మేఁక ♦ విడువఁదగునె?

మీరా :—(దుఃఖించుచు) అక్కటా! నాథా! మీ కింతిసాహసమా? ఇంత నిర్దయయా? కన్నకూఁతుపై నింత కాఠిన్యమా? అయ్యయ్యో! ఎంతమాట! లేక లేక పుట్టిన కూఁతురు - మీఁదు మిక్కిలి సుగుణవతి - ఆమెయెడల నిట్టి యపచారమా?

జయ :—దేవీ! ఈ లీల బేలవై యేల దుఃఖింతువు? నీకుఁగల వాత్సల్యము నాకుఁ గలదు - కాని - మనము సుక్షత్రియకులజులము కీర్తియే మనకుఁ బ్రాణాధికము - ప్రాణమునకు భంగము కలుగ వచ్చును - కీర్తికి భంగము రాఁగూడదు - ఏమందువా? ప్రాణము బుద్బుదము - క్షణికము - పంకిలము - కీర్తిసుస్థిరము - విమలము - నశ్వరము భరతమాత కీర్తికాములనే వాంఛించినది - సుప్రసిద్ధులనే ప్రసవించినది - మనమా పవిత్రగర్భమునఁబుట్టి, దుర్వ్యాళము గడించి యామె పేరుప్రతిష్ఠలకుఁ గళంకమాపాదింపఁగూడదు.

సీ॥ సత్యసంధుని హరి ♦ శ్చంద్ర భూపాలుని
అడ్డాల నిడుకొన్న ♦ యతివమిన్న!

లలిత మనస్కుఁడౌ ♦ నలమహీజానిని
బాలిచ్చి పెంచిన ♦ పరమసాధ్వి!
సార్థకనామున ♦ జాతశత్రునిఁ బోల
పాటలం దసికిన ♦ మహితచరిత!
కర్ణాదిదాతల ♦ గర్భమందునఁ బోసి
కీర్తిగాంచిన గొప్ప ♦ గేస్తురాలు!
గీ॥ పూతభారతమాతనా ♦ మూలముననుఁ,
యుగయుగంబులనుండియు ♦ నార్జితంబు
సేసి, బొక్కసంబున దాచు ♦ స్థిరయశస్సు
కటకటా! నేఁడు బుగ్గిలోఁ ♦ గలపఁగలదె?

గీ॥ ప్రాణమా? పోవు - మృత్యువు ♦ వాతఁబడును
బ్రహ్మ కల్పాంతమెవ్వఁడు ♦ బ్రతుక లేఁడు—
మానమా? నిల్చు నీ భూత ♦ పంచకంబు
భాస్కరాదులు నున్నంత ♦ వరకు జగతి!

మీరా :—(దుఃఖముతో) నాథా! మీ నిశ్చితాభిప్రాయమేద్ది?

జయ :—(కఠినముగ) విషమిచ్చి మీరాను జంపుటయే నా నిశ్చితము - (తల వ్రాల్చును.)

మీరా :—హా! మీరా! (మూర్ఛిల్లును)

జయ :—ప్రేమసాగరము నీదుట కష్టమే!

మీరా :—(లేచి) నాథా! నాథా! ఎట్టిసాహసమున కొడి గట్టితిరి?

సీ॥ పరిహాసమునకేని ♦ బరుషంబులాడక
మృదువుగ భాషించు ♦ సదయహృదయ!

ఆటలయుండైన ♦ నన్నమాటనుదాటి
యెఱుఁగక చరియించు ♦ నిర్ధచరిత!
పేదసాదలఁగన్నఁ ♦ బ్రేమతో లాలించి
పాలించుచుండెడు ♦ పరమసుగుణ!
ముప్పొద్దులందునఁ ♦ బురుషోత్తముని దన
మానసంబున నెంచు ♦ భక్తురాలు!

గీ॥ కటకటా! యట్టి మీరాను ♦ కరుణమాలి
చంపఁదలఁతురే? విషమిచ్చి ♦ జనకులయ్యుఁ–
గంచె యే చేను మేసినఁ ♦ గలదెదిక్కు?
తల్లియే పిల్లలం దిన ♦ ధర్మమగునె?

జయ :—(స్వగ) ఇఁక నే నిక్కడఁ జాలసేపున్న యెడల సీమె నా మనస్సునుగూడ మార్చివేయఁగలదు - ఏను త్వరితముగఁబోయి చెలికత్తెద్వారా మీరాబాయి కీ వార్తందెలిపి యామెను రప్పించి– విషమును సిద్ధముఁజేయవలసియున్నది. పో యెదను.

(నిష్క్రమించును.)

మీరా :— (దుఃఖించుచు) హా నాథా! నాథా! వెళ్ళుచున్నారా! నా ప్రార్థన మాలకింపరా? నాకుఁ గడుపుచిచ్చు తప్పదా? హా మీరా! మీరా! (మూర్ఛిల్లును.)

(తెర పడును)

---

*

రెండవ రంగము—అంతఃపురము.

(ప్రవేశము—మీరాబాయి పాండురంగ విగ్రహముతో)

మీరా:— (స్వగ) ఆహా! తండ్రిగారి యశశ్చంద్రికకు నా మూలమునఁ గళంకమా? నే నెంతటి మందభాగ్యను! అమ్మహాత్ముఁడు త్వరలోనే, విషముం గొని తెచ్చి నా కొసంగునని చెలికత్తె చెప్పి పోయినది. (విగ్రహమును ముద్దిడుకొని) తండ్రీ! రంగా! నేటికి దీనురాలిపై దయగలిగినదా? పుట్టినదాని నేటివరకు నెల్లవేళల యందు విధవిరామములు లేక, త్వదీయ పాదారవింద సాన్నిధ్యము నభిలషించుచుండఁగా - ఈనాటి కద్దాని ననుగ్రహింపనుంటివా? తండ్రీ! నీవు నన్ను నీ సన్నిధికిం బిలిపించుకొనుట నాకుఁ బరమానంద సంధాయకమే! నీ సాన్నిధ్యప్రాప్తికంటె వాంఛనీయమగు ప్రాపు నాకు వేఱొండు లేదు, కాని - భక్తురాలనగు నాకీ జనాపవాదమేమి? (తండ్రి నుద్దేశించి) జనకా! నీ ప్రయత్నము ప్రశంసనీయము! కుక్కుట్టిన కుండను బ్రద్దలుచేయవలయును - కళంకితమయిన తనువును గాటిలోఁ గలుపవలయును - జనాపవాద భయంకరపిశాచిమున కెర యగు నన్ను విషమూలమున నంతమొందింపఁదలఁచితివి. నీ సాహసము కొనియాడఁదగినది. (ప్రక్కకుఁ జూచి) పదములచప్పుడు వినఁబడు చున్నది. ఎవరువారు? (ముందునకు నడచిచూచి) తండ్రియే విష మును గొని తెచ్చుచున్నాఁడు. (సంతోషముతో) ఆహా! నేఁడుగదా నాకు విముక్తి! నేఁడుగదా నా కానందము!

(అంత విషపాత్రతో జయమల్లుఁడు ప్రవేశము)

జయ:—పాత్రను బట్టుకొని కన్నీరుగార్చుచు మిన్నకుండును.)

మీరా:—తండ్రీ! ఏల కన్నీరు గార్చెదవు? భవదీయశుభ్ర యశస్సు దిగంతములు వ్యాపించినది. అయ్యది కళంకితముగాకుండ

నా విషపాత్రము నిటుఁడెమ్ము. నేను మనసారఁ గ్రోలి, నిత్యానందమం దెదను. (విషపాత్రను బుచ్చుకొనును.)

"హా పుత్రీ! మీరా! మీరా!" (అని తెరలో రోదనము)

మీరా:—(విరుట నభినయించి) పాపము! తల్లి తన ప్రేమ వాహిని నరికట్టఁజాలకున్నది.

(అంత వీరా బాయి దుఃఖించుచుఁ బ్రవేశము.)

వీరా:—(కొమరితను కౌఁగిలించుకొని) హా! పుత్రీ! మీరా! మీరా!

మీరా:—అమ్మా! ఏల దుఃఖింతువు? మరణ మెప్పటికి యునున్నదే! ముసలితనము పైఁబడినపిమ్మట - భగవంతుని స్మరించుటకయిన శక్తి లేక చచ్చుటకంటె నీ తరుణమున మరణమందుట యుక్తము గదా! నీవు శోకం బుడుగుము - నా యంతిమ ప్రార్థన మాలకింపుము,

సీ. మార్వాడు ప్రజలే మా ♦ మకపుత్రి దుర్భాష
లాడిరంచును నొవ్వ ♦ నాడకమ్మ
జనవాక్యమునకయి ♦ తనయను విషమిచ్చి
చంపె నాథుండని ♦ వణగకుమ్మ!
ఏను చచ్చితినన్న ♦ హేతువుచే నీవు
భజనమందిరమును ♦ మరువకమ్మ!
అవని మీరాబాయి ♦ యాత్మజయై నీకుఁ
దనరినదను మాటఁ ♦ దలఁపకమ్మ!

గీ. ఎఱిఁగి తెలియమిఁ జేసిన ♦ యింతదనుక
నేను దేయుదోషముల మ ♦ న్నింపుమమ్మ!
భవ్యభవదీయ పాదప ♦ ద్మముల కేను
ప్రణతు లొనరించుచున్నాను ♦ పడయుమమ్మ.

వీరా :—హా ! ఎంతకష్ట మెంతకష్టము.

మీరా :—జనకా ! నాకు సెలవొసంగుము. భక్తిపురస్సరముగా నేనాచరించు ప్రణామములను గైకొమ్ము.

జయ :—(కన్నీరుగార్చుచు మిన్నకుండును.)

మీరా :—(విషపాత్ర నొకచేతc బట్టుకొని - వేఱొకచేతcగల విగ్రహముం బరికించి) రంగా ! పాపభంగా ! నే నెంతటియదృష్టము నడయుచున్నాను ! త్వదీయ నిర్హేతుకజాయమాన కరుణాతిశయమును నా యెడc జూపింపవలసినతరుణ మేతెంచినది. తండ్రీ !

గీ. నేను నీ దాసనౌదును ♦ నిక్కమిదియు ;
భక్తిc బ్రార్థింతు నిన్నప్డు ♦ మనసునందుc
గనుక నన్నేలు ప్రాపిచ్చి ♦ గరుడగమన !
శిష్టజనపాల ! శ్రీలోల ! ♦ శ్రితసుచేల !

(అని విషము గ్రోలుచున్నది.)

జయ :—హా ! మీరా ! ఎంతటికఠినుండన్వ. (మూర్ఛిల్లును.)

వీరా :—హా ! కుమారీ ! (మూర్ఛిల్లును.)

(అపుడు మీరాబాయి హస్తమునcగల పాండురంగ విగ్రహము వివర్ణముం బొందును.)

మీరా :—(చలింపకయే విగ్రహవర్ణము మాఱుటంగని) హా ! ఏమిది ? విషముc గ్రోలినను—వికారముదయింపకున్న దే ? ... ... ... ఆc, ఏమిది ? ఆశ్చర్యముగనున్న దే ? అయ్యో ! నా ముద్దులమూటc గట్టు విగ్రహము - ప్రాణాధికమగు నా పాండురంగవిగ్రహము - ఇంతలోనే యిట్లు వల్లcబడినదేమి ?

జయ :—(మూర్ఛనుండి లేచి) హా ! మీరా ! మీరా !

వీరా :—(లేచి) హా! తల్లీ! అప్పుడే విషము తలకెక్క— మ—ర—ణిం—చి—తి—వా ?

మీరా :—(దుఃఖించుచు) అయ్యో! తల్లీ! నేను మరణింప లేదు - అదేమి మాయయో - అదేమి చిత్రమో - నేను విషముం త్రావియు నెప్పటియట్లు సుఖముగనే యున్నాను - కాని - నా పాండు రంగఁడు వివర్ణుఁడైనాఁడు.

వీరా :—(పరుగునఁబోయి కూఁతును గౌఁగిలించుకొని) ఆహా! ఏమి నా భాగ్యము! సజీవవై యుండఁగా నిన్నుఁ జూడఁగంటిని.

జయ :— (విగ్రహము నుజూచి యాశ్చర్యముతోఁ దనలో) ఏమి యీ మాయ! దురవగాహముగనున్నదే? వాసనచూచినంత మాత్రమునఁ బ్రాణము లెగురఁగొట్టు విషమును, నేనే తెచ్చి యీమె కిచ్చితిని. అద్దాని నీమె నా కట్టెదుట గుటగుటఁ ద్రాగినది త్రాగియు సురక్షితమైయున్నది. ఈమె హస్తమునందలి విగ్రహముమాత్ర మింత లోనే రూపుమాఱి వెలవెలఁబోవుచుండుట చూడ దురవగాహముగ నున్నది.

మీరా :—(దుఃఖించుచు) హా! రంగా! పాండురంగా! ఎంత పని చేసితివి తండ్రీ! నేను గ్రోలినవిషమును నీ లోనఁ బ్రవేశపెట్టుకొంటివా? అయ్యో! నీ దివ్యమంగళస్వరూప మెంతలో మారినది? త్రిజగన్మోహనమగు నీ సౌందర్య మిప్పుడు మాయమైనదికదా! అకటా! పాపాత్మురాలనగు నేను - విషప్రయోగమునఁ జచ్చిపోయిన లోపమేమి? కాని నీ విట్టు లకారణముగఁ గురూపివైతివేల? దేవా! రాధను మెప్పించి, సత్యభామకు మరులుగొల్పి, రుక్మిణి నాకర్షించి, పదియాఱువేల గోపాంగనల వలపుం గుత్తకొన్న నీ సౌందర్య మిప్పు డేమయినది? నిర్భాగ్యురాలనగు నా కతమున విషపానమొనరించి వివర్ణుండవయితివా? అకటా!

గీ. భక్తురాలిపైఁగల ప్రేమ ♦ భావమునను
గరళముం గ్రోలి తేజమ్ముఁ ♦ దొఱఁగినావు ;
రాధ గృహమునకేఁగ నా ♦ రాము నిన్ను
వికృతాకారుఁడని యిట్లు ♦ వెడలుమనొ !

ఒకప్పుడు నీ ప్రాణప్రియ యట్లన్న నీ వేమిచేయుదువు ? ..............
రంగా! ఈ నా నడి వినుము నీవు సర్వసమర్థుండవు. యథా రూపమందుము లోకమోహనుండవగు నీ విట్టి వికృతాకారముతో నుండఁగా — నేను చూడఁజాలను.

గీ తొంటి సౌందర్యమునుబొంద ♦ కంటి వేని
శిరము బద్దలుగాఁగ నేఁ ♦ జేసికొందు
నంతియేకాని — నిన్నిట్లు ♦ లరయ లేను ;
వేఁగ నా కోర్కెదీర్పుమా ! ♦ విఠలరంగ !

(అంత విగ్రహము యథాస్వరూపమున గోచరమగును )

జయ :—(చూచి) అహా ! ఏమిది ? విగ్రహము మునుపటివలె నగపడుచున్నదే !

వీరా :—నాథా ! కొమరితయొక్క భక్తి బోధపడినదా ? పాండురంగఁ డామె యధీనమునను న్నాఁడు. పిలిచినఁ బలుకుచున్నాఁడు.

మీరా :— (సంతోషముతో) రంగా! నీవు నా మాటను బాటించి యథాస్వరూపముం గైకొంటివి. నాకిపుడు సంతోషమయినది.

జయ :—(కొమరితను గాఁగిలించుకొని) మీరా ! మీరా నీవు పరమభక్తురాలవు - లోకులకు జడిసి నిన్నుఁ జంప యత్నించినందులకు నన్ను మన్నింపుము.

మీరా :—తండ్రీ ! నిన్ను మన్నింపనేల ? తానొకటితలఁచిన దైవ మింకొకటి తలచినట్లయినది. నా యెడలఁ బ్రయోగింపఁబడిన

విషము నా పరమాత్ముఁడు హరించినాఁడు. ఇపు డేది కర్తవ్యము? నీ యపకీర్తి తొలఁగుటెట్లు?

వీరా :—కుమారీ! విజ్ఞానవతివగు నీ వట్లు పలుకుట పాడిగాదు. గతజలసేతుబంధనమేల? అయిన దేదో యయినది-లోకమును మెప్పించుటకయిన నీవు వివాహమున కంగీకరింపవలయును

మీరా :—(మిన్నకుండును.)

జయ :—(స్వగ) మౌన మర్ధాంగీకారసూచకమని చెప్పుదురు. మంత్రులకు నేనిప్పుడే వివాహయత్నము లొనరింప నాజ్ఞాపించి, చిత్తూరు రాణాను ద్వరలోనే జామాతగాఁ బడసెదను. (భార్య నుద్దేశించి) ప్రేయసీ! మన మదనసింగును జిత్తూరునకుఁ బంపవలసియున్నది. సుముహూర్తనిర్ణయమునకుఁ బురోహితుని గబురంపవలయును. పరమభక్తురాలగు మీరా తండ్రినగు నా యాజ్ఞను తిరస్కరింపదు. ఆమె తప్పక కుంభరాణాకుఁ బత్నికాఁగలదు - నీవు సందేహము నుడుగుము - రమ్ము - పోవుదము.

వీరా :—మీరా! నీవు భజనమందిరమునకుఁ బోవుదువా? లేక, నా వెంట వచ్చెదవా?

మీరా :—తల్లీ! నేను రంఛోడదేవునిదర్శింప నేఁగుచున్నాను.

(అనుబంధము—)

(భగవన్నామస్మరణ మొనరించుచు నిష్క్రమించును.)

వీరా :—నాథా! తడయనేల?

జయ :—రమ్ము - పోవుదము.

(నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును)

ద్వితీయాంకము—సంపూర్ణము.

శ్రీరస్తు.

# మీరాబాయి

## తృతీయాంకము.

### మొదటిరంగము—రాజబాట.

(ప్రవేశము—సదానందుఁడు—శివనాథభట్టు.)

సదా:— ఏమయ్యా! శివనాథభట్టూ! ఈమధ్య నేను గ్రామాంతరము పోయితిని. నిన్ననే వచ్చితిని. నగరులోని విశేషము లేమి?

శివ:— (పరికించి) ఎవరది? మా యాబిడకు నా మీఁదఁ గోపమువచ్చి పేరుల్లిపాయ నూఱుచు నూఱుచు, కన్నులలో రసము పిండినది. అందుచేతఁ గన్నులతోఁబాటు మనసుకూడ మండుచునే యున్నది సరిగా మీ రెవ్వరో నాకుఁ దెలియుట లేదు. దయచేసి, నామధేయము.........

సదా:—నేను...

శివ:—(కోపముతో) ఓహో! నీ పేరు "నేనా?" బాగు బాగు! "నేనూ!" కీ ప్రశ్నదేమి?

సదా:—(తనలో) ముసలిముండకొడు కసాధ్యుఁడు - ముక్కుమీఁద వీనికిఁ గోపము తాండవమాడుచుండును.

శివ:—ఓయి నేనూ! మాటలాడవేమి? మూఁగనోము పట్టితివా?

సదా :—తాతా ! నేను సదానందుఁడను.

శివ :—శ్రీ బ్రహ్మముంకా! నిన్నుఁ దన్నినను బాపము లేదు నేను నీకుఁ దాతనా? తల నెఱసి పండ్లూడినంత మాత్రాన నన్నుఁ 'దాతా' యని పిలువవలయునా? నా దార్ఢ్యము పరీక్ష సేయుదువా? జెప్పపట్ల పట్టు - పస బయటఁబడఁగలదు.

సదా :—(నవ్వుచు) తాతా !

శివ :—అదిగో! అదిగో! ఆ కూఁతలే కూయవలదనుచున్నాను.

సదా :—తప్పు తప్పు !

శివ :—ఎవరిది ? తప్పెవరిది ?

సదా :—నాదే, బాబూ ! నాదే తప్పు - క్షమింపుము - దయ చేసి విశేషము లెఱిఁగింపుము.

శివ :—ఆలాగున దారికిరా - మన మహారాజుగారి కూఁతు రున్నదే !

సదా :—అవునవును - మీరాబాయమ్మ - భక్తురాలు.

శివ :—నన్నుఁ జెప్పనీయవు. నీకుఁ దెలియదు—

సదా :—చెప్పు చెప్పు—

శివ :—ఆమెకుఁ బెండ్లియయినది - చిత్తూరు మహారాణావారు ఆమెను భార్యగాఁ గైకొనిరి.

సదా :—తాతా ! కాదు—కాదు—పొరపాటు—బాబూ! పొరపాటు—క్షమించుము—ఆమె వివాహము చేసికొనననిచెప్పుచుండెడిదే !

శివ :—అవును - ఆ మాట నిజమే !

సదా :—అయిన నిప్పుడెట్లు సమ్మతించినది.

శివ :—పెండ్లి చేసికొననంచు నాజన్మాంతము బ్రహ్మచారిణియై యున్న—నీవంటి కొంటెముండకొడుకులు నోటికివచ్చిన మచ్చునఁ గాఱుకూతలు కూయుదురేమోయని రాజదంపతులు భయపడి కొమ

రిత నెట్లో తల నూపఁ జేసిరి. చిత్తూరు రాణాయగు కుంభుఁ డామె సౌం దర్యమునకు ముగ్ధుఁడై కోరి యామెను గ్రహించినాఁడు.

సదా :—వివాహ మెక్కడ జరిగినది ?

శివ :—ఇక్కడనే—ఈపట్టణమునందే !

సదా :—చిత్తూరునుండి వారందఱు నిటకు వచ్చియుండిరా ?

శివ :—మూర్ఖుఁడా ! బ్రహ్మదేవుఁడు నీబుఱ్ఱలో నేమిపెట్టి నాఁడురా ?

సదా :—(నవ్వుచు) బంగారము.

శివ :—కాదు—బంకమన్ను. బుఱ్ఱలో నీకు బంగారమేయున్న యెడల మొన్న మీచెల్లెలు చేతులకు గాజులు చేయించుకొనఁదలఁచి కోమటిదగ్గఱ నెందులకు రెండుకాసులంగొనును ? నీబుఱ్ఱకే యట్లు కాడతోడనో, కన్నముపెట్టి బంగారము దీసికొనియుండెడిది.

సదా :—నీబుద్ధికి సంతసించితినిలే—రామాయణములోఁ బిడుకలవేరువలె నీ యనవసరప్రసంగ మేల ? చెప్పుము. చిత్తూరునుండి వారెల్లరు నిటకు వచ్చియుండిరా ?

శివ :—రాకున్న వివాహమెట్లగును ? చిత్తూరు మహారాణా మంత్రులు—పురోహితులు—సామంతులు—సరదారులు—సేనాధిపతులు-చుట్టములు—పక్కములు—విదూషకులు—గాయకులు—కవులు — పండితులు—మున్నగువారిని వెంటనిడుకొని మహేంద్రవైభవముతో వచ్చి నాఁడు. సంధ్యావందనమునకుం, లేని చవటకైదికికూడ నా మహారాజు వలన బంగారునాణెములను బడసినాఁడు. మన మహారాజుగారుకూడ మహావైభవముతో వారికి స్వాగత మిచ్చిరి. భూమ్యాకాశమంతట నొకేపందిరి వేసిరి. దాని యలంకారాదులను వర్ణించుటకు నాకు శక్తిలేదు.

సదా :—వివాహమంత ఘనముగా జరిగినదా ?

శివ :—అదియొకమాటా ?

సదా :—అవును. సర్వశక్తిసంపన్నులు మహారాజులు వారు చేయలేకున్న మనమూ చేయఁగలము !

శివ :—ఒక వింతమాత్రము జరిగినది.

సదా :—ఏమది ?

శివ :—పెండ్లికూతురు—మహారాజపుత్రికమాత్రము—తన మామూలు పాటలను మానినదికాదు. పెండ్లికాలమందయిన విలువైన చేలములను ధరింపలేదు. అలంకారముల నాశింపలేదు పాండురంగని విగ్రహమును మరచిపోలేదు.

సదా :—ఆశ్చర్యము !

శివ :—ఆశ్చర్యమే ! ఆమె ముఖచిహ్నములం బరికించినఁ దల్లిదండ్రుల మాటం గాదనలేక బలవంతముగా పెండ్లి కంగీకరించిన దని స్పష్టమగుచున్నది.

సదా :—ఇప్పుడామె యెక్కడనున్నది ?

శివ :—ఎక్కడనుండును ? వివాహానంతరమే భర్త యామెను దనవెంట నిడుకొని వెడలినాఁడు

సదా :—పూర్వజన్మసుకృతము కాఁబోలు ! ఆమె బాల్యము నుండియు భక్తురాలే !

శివ :—నీవంటి దౌర్భాగ్యుఁడయిన. పెండ్లికాలమందు నాకుఁ గట్నము చాలదనియు బట్టుపుట్టము లీయ లేదనియుఁ గినియును. ఆమె మహాభక్తురాలు ! ఆకనుజయించి యెల్లవేళలయందుఁ బాండురంగనామమును స్మరించు పూతాత్మ.

సదా :—రాత్రులందు దొంగ లింటిలోఁబడి యును పెట్టె తాళము బద్దలుకొట్టుకొండ నీవును భగవన్నామస్మరణము సేయుచుందువు. ఎఱుఁగనివారయిన, "నీతఁడు భీష్ముఁడంతటివాఁడు - మహాభక్తుఁడు" అని తలంచి మోసపోవుదురు.

శివ :—కుట్టకుంకా! నాకెందులకీసోది. పనియున్నది—వప్పా భొట్టుగారింటికిఁ బొయెదను

సదా :—నాకు నేతిభొట్లుగారింటికడఁ బనియున్నది. నేనుకూడ నీవెంటనే వచ్చెదను.

శివ :—చిన్నతనమునుండి యీ కొంటెతనము మానలేదు కదానీవు!

సదా :—వృద్ధాప్యముపైఁబడి నేడో రేపో కాటిలోఁగలియ నున్న నీకే కొంటెతనమున్నదిగదా! నాకు డదా? రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

---

రెండవరంగము—చిత్తూరునందలి యంతఃపురము.

(ప్రవేశము—సుగుణాబాయి)

సుగు :—(స్వగ) తమ్మునికు రాథోరురాజపుత్రికగు మీరాబాయితక్కఁ దక్కంగల రాజపుత్రిక లెవ్వరును నచ్చలేదుకాఁబోలు! తుదకామెను బెండ్లిచేసికొని—వెంటనిడుకొనివచ్చెగాదు. అదేమిపాపమో! క్రొత్తగాన త్రింటఁగాలు పెట్టినది మూఁడుదినములయినాగాలేదు. పట్టమహిషియని తన్నుఁజూడవచ్చినవారిం గన్నెత్తిచూడదు—వదిననగు నామాటనాలించి యాంభరణములు ధరింపదు—ఎప్పుడు భజనలే!—పూజలే—ప్రార్థనలే! ... సన్న్యాసినివలె నెవ్వరేమను కొందురోయను జంకుగొంకు—ఎగ్గుసిగ్గులు—లేక—చేతనొకవిగ్రహమునుబట్టుకొని, వినవిరామముగ—"రంగా! రంగా!" యని పలవరించుచున్నది. అదెక్కడిభక్తియో! అదేమివైరాగ్యమో! భర్త

యేమనునో యన్న భయము లేదు. వదినగారు నామాటకు లక్ష్యము లేదు— మొదటిరోజుచూచితిని—రెండవరోజుచూచితిని. ఇది మూడవ రోజు! ఇంక నిట్లెంతకాలము సహించుట!

(అంత నేపథ్యమున మీరాబాయి పాడుచుండును)

(అనుబంధము—— )

సుగు :—(వినుట నభినయించి) అదిగో! మరలసిద్ధము—చెడి పోయినదాసరివలెఁ దండనాపదములఁ బాడుకొనుచు నిటు వచ్చు చున్నది నేఁడు నగరులో మహోత్సవము జరుగుచున్నది ఈపూట నయిన నీమె ముచ్చటదీఱ సైసేసికొనరాదా?

(అంత మీరాబాయి పాడుచుఁ బాఁడురంగవిగ్రహముతోఁ బ్రవేశము)

మీరా :—(సుగుణాబాయినిజూడకుండఁ బరమానందముతో) రంగా! శ్రీరంగా! అహా! ఏమి నీతేజము! ఏమి నీసౌందర్యము! చూచినకొలఁదియుఁ జూడవలయుననియే యుండును.

సుగు :—(కోపముతోజూచి స్వగ) వేషము బాగుగనే యున్నది. భర్తయొక్క సౌందర్యమునుమాని యీపాడునోరు లేని కొయ్య బొమ్మను గొనియాడుచున్నది

మీరా :—(తన్మయత్వముతో) ఓ త్రిజగన్మోహనాకారా! కల్యాణమూర్తీ! రమ్ము—సాక్షాత్కరింపుము. నీస్వరూపముంజూచు టకుఁ గన్నులు వేగిరపడుచున్నవి నీగాత్రముం గౌగిలించుకొనుటకు బాహువులు తొందరసేయుచున్నవి. నీమోముంజుంబించుటకు......

సుగు :—(ముక్కుమీఁద వ్రేలిడుకొని) ఆఁ—ఆఁ—ఎంతమాట! తుదకీమెకు మతిపోవుచున్నది.

మీరా :—రంగా! రమ్ము—నాకు ముద్దియ్యుము—పదియారువేల గోపికలను భరించు రసికాగ్రగణ్యుఁడవైన నీకు నొక్కతెను భార మా? స్వామీ!

సుగు —(అగ్గిలోనై, క్రోధోద్రేకముతో) ఏమి యీ ప్రేలాపనములు ? సిగ్గుబిడియములు లేవా ? రాచకులమునఁబుట్టలేదా ?

మీరా :—(ఆకస్మికముగఁ గన్నులు తెఱచి చూచి) వదినగారూ ! మీరా ?

సుగు :—ఓహో ! అంతవఱకు వచ్చినదా ? ఇక్కడనే యుంటివా ? పరలోకములోఁ గొండుఁగని ప్రపంచములో బసయుంటివా ?

మీరా :—అట్టిభాగ్యము నేను నోచుకొనలేదుకదా !

సుగు :— (కోపముతో) చాలుఁజాలు నూరకొనుము. క్రొత్తగానిన్నగాక, మొన్న నత్తింటఁ గాలిడితివిగదా ! భయభక్తులక్కఱలేదా ? నయవినయములు చూపవలదా ? తరుణవయస్కవయిన నీవు చక్కఁగా సింగారించుకొని యేకాంతమునలోఁ బాల్గొనుటకు బదులు ఈ యోగివేషమేమి ? ఈ యున్మత్తప్రలాపములేమి ? నీభర్తవిన్న నెంతప్రమాదము ! నీతలను బుచ్చెలుగాఁదెగ నఱుకఁడా ?

మీరా :—వదినగారూ ! మీమాటలు నాకు బోధపడుటలేదు. నేనాడిన దుర్భాషలేవి ? తలను బుచ్చెలుగాఁదెగనఱుకుటకు నావలనఁగలిగిన పొరబాటులేవి ?

సుగు :—చాలుఁజాలు నూరకొనుము—కొయ్యబొమ్మనుబట్టుకొని—"ముద్దుపెట్టుకో-కౌఁగిలించుకో" అనుట తప్పుగాదా ?

మీరా :—(మందహాసమొనరించి) అయ్యో, వెఱ్ఱితల్లీ ! లోకభర్తయగు నాపరమాత్ముని పవిత్రవిగ్రహమును ముద్దిడుకొనుట దోషమా ? అనుగ్రహితాత్ముని దివ్యమంగళస్వరూపమగు నీప్రతిమను "కొయ్యబొమ్మ" యని తూలనాడఁదగునా ? వదినగారూ !

సీ॥ ఎవ్వానిబొజ్జలో ♦ నిమిడియున్నవి సదా
కమలభవాండ భాం ♦ డములుక్రమత ,

నేఁడు నగరిలో మహోత్సవము జరుగనున్నది. లోనికివచ్చి యమూల్యవస్త్రాభరణములను ధరింతువా? లేదా?

మీరా:—అమ్మా!

సుగు:—(అర్థోక్తిలో) అమ్మ—బొమ్మయని కాలయాపన సేయకుము. నిన్ను-నీ దొంగభక్తిని—నీకపటవైరాగ్యమును జూడఁగా—చూడఁగా—నాకు అకాలివంటి తల కెక్కుచున్నది—చెప్పుము. నీకు వస్త్రాభరణములు కావలయునా?

మీరా:—వదినగారూ! నావిన్నపము నాలకింపుడు

గీ. వస్త్రములఁ దాల్చినంతనే ♦ భక్తిగాదు
భూషణంబులవలన స ♦ న్ముక్తి లేదు
మానరక్షణకున్న ♦ వసనచాలు
క్రొత్తవాసిని ధరియింప ♦ గోర్కెయుడుగు

సుగు:—(చుఱచుఱచూచి) తాఁజెడ్డకోఁతి వనమెల్లఁజెఱచిన దన్నట్లు, నామతినిగూడ నీవు పోఁగొట్టుచున్నావు. నిన్నుఁ దగినరీతిని రాణాతోఁజెప్పి మందలింపఁజేసెదను. (ముందునడచి) నక్కను సింహాసనమునఁ గూరుచుండఁబెట్టినను అది వెనుకటియట్లే వర్తించును. ఈమెబుద్ధియుఁ గుక్కబుద్ధియు నొకటే! వెదకివెదకి కుంభుఁడు మంచి బొంతనే సంపాదించినాఁడు... కానిమ్ము. ఇప్పుడు మునిగిపోయిన దేమున్నది? సమయముగనిపెట్టి, కల్లబొల్లిమాటలు నాలుగు వానికిఁజెప్పి ఈమెకు స్వస్తివాక్యముఁ జెప్పించితీరెదను.

(నిష్క్రమించును)

మీరా:—ఆహా! ఈమె యవివేకమునకు హద్దులేకున్నది కదా! పరమాత్మునిప్రేమను గన్నులకద్దుకొని తరించుటకు బదులుగా దూషించినది...... ఆమెనుగూర్చి నేను వగవనేల? ఎవరికర్మఫలమును వారేయనుభవింతురు.

(నిష్క్రమించును.)

(తెరవ్రాలును)

---

మూఁడవరంగము—శయనాగారము.

(ప్రవేశము—కుంభ రాణా)

కుంభు—(స్వగ) అతిజగన్మోహనవిగ్రహంబును జూచితకొలఁదియుఁ జూడవలయుననియే యుండును కమలభవుఁడు తన యద్వితీయ నిర్మాణ కళాకౌశల్యముం బ్రకటించుటకో యన – సౌందర్యమును మూర్తీభవింపఁ జేసి, మీరాగాఁ జేసినాడనుట యతిశయోక్తిగాదు షోడశకళాపరిపూర్ణుఁడగు చంద్రుఁడా యింతి మోముకెదుట దిగదుడుపే! వానిలోఁ గళంకమున్నది—ఆమె మోమున నది కానరాదు. తేజఃపుంజములు వెదఁజల్లు వెడఁదకన్నులతో మందస్మిత సుందరవదనారవింద ముతో భాసిల్లు నా కుటిలకుంతలను వివాహమండపమునఁ బ్రత్యక్షముగఁ జూచినపుడే నామనస్సు పగ్గములచేఁ గట్టివేయఁబడినది చూపులు కేంద్రీకరింపఁబడినవి—మన్మథుఁడు విజృంభించినాఁడు—కుతూహల మధికమయినది. (కొంచెమాగి) అట్టిసౌందర్యరాశికి—లేజవ్వనికి-వైరాగ్యమెందులకో! అంతఃపురముం బ్రవేశించి మూఁడునాలుగు దినములైనది. కాని యొకనాఁడయిన శయనాగారముం బ్రవేశించి నా తాపమును బాపలేదు—ఒకవేళఁ గ్రొత్తయగుటచే నబలాసహజమగు సిగ్గును నటించుచున్నదేమో! ఇప్పుడు నే నీ యామెకడకుఁ బోయి కోరికలీరికలెత్త శృంగారతరంగముల మునిఁగి తేలుచు మన్మథునిఁ బీచ మడంచెదను. (పక్కకుఁజూచి) అల్లదే, నాప్రేయసి! నిండువెన్నెలలోఁ జలువఱాతిన్నెపయిఁ గూరుచుండి తనలో దానేదియో పాడుకొనుచున్నది. ఇదేసమయము—(గవాక్షమువంకఁదిరిగి) తుంటరి చందురుఁడా!

గీ కళలు పదియాఱుఁగలైన • గర్వమేల?
అదయుఁడై యేచు మదనుని • యంశనుండి

బాధఁగొల్పుచున్నావు ♦ భామఁగూర్చి
నీదు పోగరునడంచెద ♦ నిశ్చయముగ.

(నిష్క్రమించును.)

తెరవ్రాలును.

---

నాల్గవరంగము—ఉద్యానవనము.

(ప్రవేశము —మీరాబాయి పాండురంగనిప్రతిమతో)

మీరా :—(ప్రతిమను ముద్దులాడుచు) రంగా! రంగా! ఇపుడు నీ కానందముగనున్నదా ? నీవు సుఖించుచున్నావా ? అమృతమయములగు నీ చంద్రకిరణములలో ఉల్లమున కుల్లాసముగలిగించుచు మెల్లమెల్లనవీచు నీచల్లగాలిలో, నీవు సుఖింతువనియెంచి నిన్నిక్కడకు గొనివచ్చితిని.

(అంత నేపథ్యమున)

శా. ఆరాధింపఁగనేల ? విగ్రహము ను ♦ ద్యానంబునందొంటిమై
లేరే ? యన్యులునీవుగొల్వ సుఖమై ♦ లేఁబ్రాయమందున్నదా !
వారింజూడవొ ? కోరవో ? తెలియవో ? ♦ భావింపఁగానొల్లవో ?
వైరాగ్యంబను వార్ధిమున్గుటనునో ♦ పంకేజపత్రేక్షణా !

(అనుపద్యముంజదువుచు రాణా ప్రవేశము )

మీరా :—(లేచినిలువఁబడి) నాథా ! ఆరాధింపఁదగినవాఁడు జగదాధారభూతుండగు పాండురంగఁడొక్కఁడేకదా !

కుంభ :—(ఆమెచెంతఁ గూరుచుండి) కాంతా ! వృద్ధులు పలుకఁదగిన పలుకులవి—నిండుజవ్వనముననున్న సౌందర్యతేజోరాశి వగు నీకుఁ బాండురంగఁడేల ? వానిప్రతిమయేల ? భజనలేల ?

మీరా:—(మందహాసముతో) నాథా! ధర్మజ్ఞులగు మీరట్లు నుడువుట భావ్యమా? సర్వలోకేశుఁడగు నా పాండురంగఁడే నా కక్కఱ లేకపోయిన యెడల నీకఁ గావలసిన దేమున్నది? భక్తమందారుని భజించుటకు యౌవన మైన నేమి? లేక, వృద్ధాప్య మైన నేమి? సారసలోచనుని సంస్మరించుటకు సౌందర్య మున్న నేమి? కురూపమున్న నేమి?

కుంభు:—ప్రేయసీ! ఈపండు వెన్నెలలోఁ జలువఱాతిపైనఁ గూర్చుండి నాకు నుపదేశింపవలసినది—రక్తిగాని—భక్తిగాదు—ప్రసాదింపవలసినది సౌఖ్యముగాని—సాయుజ్యముగాదు—బోధింపవలసినది—శృంగారముగాని—వైరాగ్యముగాదు—నేర్పవలసినది మన్మథారాధనగాని—తారకమంత్రముగాదు.

మీరా:—(స్వ) ప్రాణేశ్వరుఁడు విద్యాధికుఁడయ్యు, నింత సంభావన మొనరించుచున్నాఁడేమి?... (ప్రకా) నాథా! భక్తిలో రక్తిగలదు—సాయుజ్యములో సౌఖ్యమున్నది.

కుంభు:—ప్రేయసీ! చీనాంబరమునకుఁ జిమ్మెటవలె చిత్రపటమునకుఁ జెదపురుగువలె నీమోహన దేహసుమంబున దుష్టవైరాగ్య కీటకము ప్రవేశించినది. (కొంచెమాగి) ఆహా! ప్రకృతి యెంతరమణీయముగ నున్నదో చూచితివా?

సీ. పదియాఱుకళలతో • భాసిల్లుచున్నాఁడు
కలతఁ బుట్టించుచుఁ • గలువఱేఁడు
అల్లనల్లన నుల్ల • ముల్లాసమును బొందఁ
గడఁగి వీచుచునుండె • గంధవహుఁడు
క్రొంగ్రొత్తతళుకుతోఁ • బొంగి నింగికిఁ జూచుఁ
గోరికల్ కొనసాఁగఁ • గుముదసమితి

శాఖాగ్రములనున్న ♦ శకునికరంబు
లెంచి కూతలమదిఁ ♦ దృప్తి బలుపు
గీ. బ్రకృతియంతయు శోభాయ ♦ మానమగుచు
వెలయుచున్నది కాదె? యీ ♦ వేళయందుఁ
జలువరాలిన్నెపై సార ♦ సాక్షి గూడి
రతులఁదేలెనీ పురుషుఁడే ♦ రమ్యజీవి!

మీరా:—నాథా! నాసాహసమునకు మన్నింతురేని, ఆ యభిప్రాయము యుక్తమైనదికాదని చెప్పఁదలచుచున్నాను. ప్రకృతియంతయుఁ బరమేశ్వరుని స్వరూపమే కదా! ప్రతివస్తువునందును బ్రతిప్రాణియందును బాండురంగఁడున్నాఁడు. భక్తితో వానిని బ్రార్థించి జన్మమును దరించుకొనుట ధర్మము.

కుంభ:—(స్వగత) ఈమెనుబట్టుకొని పీడించుచున్న యీ వైరాగ్యపిశాచము వీడుమార్గము గానరాకున్నదే! అబ్బా! నాకు సంతాపమధికమగుచున్నది. మారుఁడు నాపైవిజృంభించుచున్నాఁడు. ఈమె—మనసులోమనసుఁగలిపి, వానిగర్వము సర్వము ఖర్వముచేసిన, నాకు శాంతి సమకూడియుండెడిది. ప్రయత్నించిచూచెదను. హృదయమునఁ బరివర్తనము గలుగకుండునా? (ప్రకా) ప్రేయసీ! ఆవృక్షముఁ జూడుము.

చ. చిలుకలజంట కొమ్మపయిఁ ♦ జేరిసుఖంబును బొందుచుండెఁ; గు
వ్వలు రతికేళిఁదేలుచును ♦ భావజుఁగొల్చుచుండెఁ బ్రీతిమై;
విలసితరూపతేజముల ♦ వెల్గెఁ బువు మీఁద నొప్పుఁగా
లలితమనోజ్ఞమార్గముల ♦ రంజిలఁజేయవె? నన్ను నిమ్మెడన్.

మీరా:—నాథా! ప్రకృతి కడుంగడు మనోహరంబుగ నుండుటచేత నట్టివారికేని హృదయము ప్రశాంతముగ నుండును. కనుక

నిట్టిసమయమున నేకాగ్రబుద్ధితో నైక్యకంఠముతోఁ బాండురంగసంకీర్తనమొనరించువారు ధన్యులు.

కుంభ :—అబలా ! ప్రకృతిరామణీయకత హృదయమున శాంతిని నెలకొల్పుననుచున్నావు అదియేటిమాట ? కోరికలుదయించినవి; వ్యాకుల మధికమగుచున్నది; దుర్భరమగు తాపమును బాపుము

మీరా :—దేవా ! కోరికలను నెఱవేర్చువాఁడా గోపబాలుఁడు—వ్యాకులమడంచువాఁడా వాసుదేవుఁడు—తాపముం బాపువాఁడా దనుజమర్దనుఁడు.

కుంభ :—(విసుగుతో దనలో) అబ్బా! ఇఁక నీమెకు సమాధానము చెప్పుట యెట్లు ? (మన్మథు నుద్దేశించి) ఓరీ తుంటరి వచ్చవిల్తుఁడా ! నీవు లాంగినకొలందియుఁ బిడించుచున్నావుగదా ! ఇది నీపక్షపాతబుద్ధియా ? లేక, శక్తివిహీనతయా ? త్వదీయారాధనమున కింతగాఁ బ్రోత్సహించినను, ఈమె యంగీకరింపకున్నదే ! నాపై విసుచుశరముల నామెపైఁగూడఁ బ్రయోగింపవేల? దుష్టుఁడా!... ... నామనోగతాభిప్రాయము నీమెకు విస్పష్టముగాఁ జెప్పివేచెదను. అప్పుడేమనునో !—(ప్రకా)

మ. అతివా ! దాఁపఁగ నేల ? నిన్నలసి హృ ♦ ద్యానంబునందియ్యెడన్
రతికేళిం దనుగంగ వచ్చితిని; యు ♦ శ్రాంతంబు నామారుఁడు
ద్ధతిమై నాటుశరాళి కోర్వఁజమి ! నీ ♦ దాసానుదాసుండ; న
న్నతిరాగంబున నేలుకొమ్ము; సుఖినై ♦ యానందముం బొందెదన్.

మీరా :—ప్రభూ ! తమకానందముగూర్చుటకు నేను సమర్థురాలనా ? మీకును—నాకును—సకలచరాచరంబులకును సంతోషముం గూర్చువాఁడా సర్వేశ్వరుఁడుగదా !

కుంభ :—(స్వగ) అకటా ! ఇపుడేది కర్తవ్యము ? మదనసంతాప మంతకంతకధికమగుచున్నది ఇష్టము లేనియింతితో నరసము

లాడిన నేమి ప్రయోజనము? కడసారి ప్రశ్నించిచూచెదగాక!

(ప్రకా) ప్రేయసీ! నేను నిన్నెంతిగా బ్రతిమాలినను వినకున్నావు. మన్మథుఁడు నిర్దయుఁడై నన్నుఁ బీడించుచున్నాఁడు—వాని సేవించు వెన్నెలలో నారాధింతము—రమ్ముఁ

మీరా:—(నవ్వుచు) నాథా!

చ. పురహరుకంటిమంటలను ♦ బోడిమి మానసంగుఁడయ్యె; సు
స్థిరతఁజెలంగు మానులను ♦ జేరఁగ లేఁడు; సుశక్తిహీనుఁడా
మరునిభజింపనేమిటికి? ♦ వానిఁగన్న రమేశుభక్తితోఁ
జరణములంటి ముక్తిపదము ♦ జన్మతరించును; తథ్యమిానుమల్
శిరసుంచఁగా మోకాలిపూజయేల?

కుంభు:—(స్వగ) ఇఁక నీమెతో భాషించిన లాభము లేదు. శయనాగారముం జేరి నిద్రించుటయే యుత్తమము. పోయెదఁగాక!

(నిష్క్రమించును.)

మీరా:—(ప్రతిమను ముద్దిడుకొనుచు)

గీ. రంగ! కస్తూరిరంగ! శ్రీ ♦ రంగ! రంగ!
నిన్నె మదినెంచి ప్రేమించి ♦ నిన్నె నమ్మి
నీకొసంగిన దేహమ్ము ♦ నేఁడు పరున
కెట్టులర్పింపఁగడఁగుదు ♦ నెఱుఁగఁజెపుము!

తండ్రీ! జోలపాటంబాడెదను నాయొడిలో నిద్రింపుము.

(అనుబంధము—).

తెరవ్రాలును.

తృతీయాంకము సంపూర్ణము.

——

శ్రీ ర స్తు.

# మీ రా బా యి

## చతుర్థాంకము.

మొదటిరంగము—అంతఃపురము.

(ప్రవేశము— మీరాబాయి, చెలికత్తెయగు నళినితో)

మీరా :—నళినీ! నీవు చెప్పబోయిన దేమి?

నళి :—ఏమియు లేదమ్మా! ఎవ్వఁడో యొకసన్యాసి—ఘనభక్తుఁడు ముప్పొద్దులందుఁ బాండురంగనామస్మరణము సేయుచు వీధులం దిరుగుచున్నాఁడు. వేణుగోపాలస్వామివారి యాలయమునకుఁ బేదసాదల నెందఱినో వెంటనిడుకొనిపోయి తన్మోహనగాన మొనరించుచున్నాఁడు.

మీరా :—నళినీ! నళినీ! నీవు త్వరితముగఁబోయి యాభక్తుని దోడ్కొనిరమ్ము—బొమ్ము.

నళి :—దేవీ! శుద్ధాంతఃపురములలో నన్యపురుషులను బ్రవేశపెట్టినయెడల నేమిముప్పువాటిల్లునో! అంతఃపురసాంప్రదాయములకు విరుద్ధముగఁ బ్రవర్తింపఁగలనా?

మీరా :—నళినీ! మాఱుమాటాడక పొమ్ము—అమ్మహాత్ముని దోడ్కొని-రమ్ము. అట్టివాని పాదరజము సోకినంతనే యంతఃపురి పవిత్రము కాఁగలదు.

(అంత నేపథ్యమున)

శ్లో. కురుతే గంగాసాగర గమనమ్
వ్రతపరిపాలన మథవా దానమ్
జ్ఞానవిహీన స్సర్వమతేన
ముక్తిం నభజతి జన్మశతేన ॥భజగోవిందం॥

నళి :—(వినుటనభినయించి) దేవీ! ఆవినవచ్చుకంఠస్వర మా సన్యాసిదే! ఆతఁడేకాఁబోలు వీథంబడి పోవుచున్నాఁడు.

మీరా :—వెదుకఁబోయినతీఁగ కాలికిఁ దగిలినది—పొమ్ము. ఆతఁడు దూరమేఁగుటకుముందేపొమ్ము "మహాత్మా! మిమ్ములను సందర్శించుటకు మాదేవి కుతూహల పడుచున్న" దని చెప్పి, వానిం దోడ్కొనిరమ్ము.

నళి :—చిత్తము.

(నిష్క్రమించును.)

మీరా :—(స్వగ) కంఠస్వరము నాకుఁగూడఁ బరిచితమే! (స్మృతిఁ భినయించి) నాగురుదేవుఁడప్పుడు చిత్తూరునకుఁ బోవుచున్నాను వచి చెఁగదా! ఈభక్తశేఖరుఁ డాతఁడేయగుట నిక్కువము. (ఆతురముతో వానిరాక కెదురుచూచుచుండును.)

(అంతనళిని దయానందుని వెంటనిడుకొని ప్రవేశము.)

దయా :—(దూరమునుండి మీరానుబరికించి) అహో! ఏమి నాభాగ్యము!

గీ. వినుత పాండురంగ పదార ♦ వింద చింత
నామృతాస్వాదనాసక్త! ♦ యమలహృదయ!
మూర్తిఁగైకొన్న సద్భక్తి ♦ పుంజమదిగో!
కంటి, మీరాలతాంగిఁ ♦ గౌతుకమున.

మీరా :—(దయానందునిజూచి) మహాత్మా! గురుదేవా! త్వదీయ పవిత్రసందర్శనభాగ్య మీదాసురాలికి నేఁడు లభించినదా! (పాదములపై వ్రాలును.)

దయా :—కుమారీ! లెమ్ము. నేనీనగరంబున నుండఁగనే, రాణావారు నిన్నుఁ బరిణయమాడి తీసికొనివచ్చిరని వినియుంటిని ఎప్పుడో యవకాశము చిక్కినపుడు నిన్నుఁజూడవలెనని తలంచితిని. నాకోర్కె నేఁడు దప్రయత్నముగ ఫలించినది.

మీరా :—మహాశయా! హృదయము భగవదర్పితమగుటఁ బెండిలి వలదని యనేకవిధముల జననీ జనకులను వేఁడుకొంటిని. వారు నామాటను జెడచెవి బెట్టిరి.

దయా :—(నవ్వుచు) అమ్మా! రాజమహిషి యైతివి. పూర్వమువలె, నీభజనల కాటంకము గలుగునేమో నుట లేదుగదా ?

మీరా :—దేవా! నేను చిత్తూరురాణావారికి సేవలను దాసినేయఁదగుదను, కాని మనసిచ్చి మోహించినకాంతను గాను. నావలన వారి కవ్విధమైనసౌఖ్యము నందదు. ఏనంగారా? అలంకారములన్న నాకుఁగిట్టదు. క్రొత్తక్రొత్తచీరలఁగట్ట మనసొప్పదు వనవిహారములు నాకుఁ బనికిరావు ఎల్లవేళలయందు సామాన్యమగు వేషముతో—సామాన్య స్త్రీపురుషులంగలసి గోవిందుని సంకీర్తించుటయే నాకుఁ బరమానందసంధాయకము. నేనిట్లు భోగముల నొల్లక యోగినివలెనుంనుట మహారాజున కిష్టముగాకున్నది.

నళి :—అయ్యో! అంతఃపురములో మాపట్టపుమహిషికాదరణము లేకపోయినను—పురమునందలి ప్రజలలో గౌరవాభిమానములు ప్రబలినవి. రాళ్లనుసైతము చెమ్మగిల్లఁజేయఁగల యీామెగానము సర్వజనుల నాకర్షించినది. వారెల్లరు ఈమెను జనుమాతగాఁ బరిగణించుచున్నారు. (పదములు చప్పుడు నాలకించి తనలో) సుగుణాబాయమ్మ వచ్చి చాలున నిలువఁబడినది ఆమెకంటఁబడకుండ మెల్లఁగా నేనిట నుండి జాఱెదను. (నిష్క్రమించును.)

మీరా :—దేవా ! పరీక్షించుటకో, లేక, విలాసార్థమో కాని భగవంతుండు తన్ను నమ్మినవారి నెక్కుడుకష్టపెట్టుచుండును.

దయా :—అమ్మా! మానవులు కష్టసుఖములకు లెక్కసేయ రాదు. మేలుకలిగినను, కీడుమూడినను బరమేశ్వరసంకల్ప మేయని తలంచి, భక్తినిడువక యుండవలయును.

సుగు :—(స్వగ) తుద కంతఃపురము లీవిధముగా మారినవి. దేవాలయములు వసతులుగాను ఆటస్థలములు ఎండకన్నెరుగని రాచపడుచులకు నివాసములగు భవనములు—ముష్టిముండకొడుకులగు దొంగ జడదారులకు దావులైనవి ఈసన్యాసి యెవ్వడో, తెలిసికొని సమ్మట రాణాతోఁ జెప్పి వీనిని దండింపఁజేతును (మందునకువచ్చి కోపముతో, ఏమయ్యా ! ఎవఁడవు నీవు ? నీకు బుద్ధియున్నదా? లేదా? పులిమాంసములతో నూఁగులాడ దొడ గినట్లు రాజమహిషితోఁ బ్రసం గించుచున్నావు ?

మీరా :— (సవినయముగ) వదినగారూ ! ఈమహాత్ముఁడు భక్తపుంగవుఁడు—

సుగు :—(అర్థోక్తిని) ఆతఁడు భక్తుఁడో—తుంటరియో నిన్నెవ్వ రడిగిరి ? నీవెందులకు బదులుచెప్పుచున్నావు—పానకములోని పుడకవలె. దగుదునని యన్నిటిలో దూరెదవు.

దయా :—అమ్మా ! నీకింతయాగ్రహమేల ?

సుగు :—ఓరీ, మూఢుడా ! నాకాగ్రహ మెందులకనుచు న్నావా ? నీవంటిపురుషునందడుగుపెట్టుట బాగున్నదా ? రహస్యము గా రాజమహిషితోఁ బ్రసంగించుట బాగున్నదా ?

మీరా :—వదినగారూ ! ఏదైనదోషమున్న నది నాదికాని, యాతనిదికాదు—పాపమా మహాత్మునిపైఁ గోపించుట మీకుచితమా? నాకు గురువగుటవలన వీథింబడి పోవుచున్నవానిని నేనే పిలిపించితిని

సుగు :—ఏమేమి? ఈబుద్ధి ఏ కేపుట్టినదా? ఈతుంటరిసన్యాసి నీకుగురువా? మగవారిని రాచపడుచులు కన్నెత్తిచూచుటయే తప్పుగదా! నీవు సామాన్యయువతివిగావు—చిత్తూరుమహారాణా కోరిపెండ్లాడిన యందకత్తెవు—పరపురుషు చరియింపవీలులేని శుద్ధాంతఃపురములలోనికి, ఇట్టి కపటసన్యాసులను బిలిపించుకొనుచున్నావా?

మీరా :—అకారణముగ నమ్మహాత్ముని నిందింతురేల? ఆతఁడు కపటియని మీకెట్లు తెలియును?

సుగు :—ఏమో, ఎట్లు తెలియునో! నేను నీవలె విజ్ఞానవతిని గాను—నీప్రశ్నలకు సమాధానమిచ్చుట కియ్యెడకు రాలేదు. యుగయుగములనుండియుఁ బ్రఖ్యాతివహించిన చిత్తూరురాణివాసములో నిట్టి యత్యాచారములు జరుగుచుండ నేను చూడలేను—వానిని నుచ్చుమాపుట—

దయా :—(స్నిగ్ధోక్తియందు అమ్మా! యుక్తాయుక్తములు లేక యేక మాటాడెదవేమి? ఏగూటిచిలుక యాగూటికేఁ జేరును—ఆమెభక్తురాలుకనుక—భక్తుండనగు నన్నుఁబిలిచి సత్కరించినది ఇందత్యాచారమేమున్నది?

సుగు :—(కోపముతో) హెచ్చుతగ్గులులేక, నోటికివచ్చినమచ్చునఁ బేలుచున్నావు—జాగ్రత! నాకు యుక్తాయుక్తములు తెలియవా?......తుచ్ఛుఁడా! వచ్చినదాటి వావలకుఁబొమ్ము లేకున్న నీగుర్తు తీయింతును.

దయా :—(మందహాసముతో) అమ్మా! నేను నీయింట నెల్లుండుటకురాలేదు—పూల్లుండుటకు రాలేదు. నీవు భయపడనక్కఱలేదు. కాని నీకిట్టి దుడుకుఁదనముండుట తగదు.

సుగు :—ఛీ—పొమ్ము—అవలకుఁబొమ్ము. ముష్టిముండకొడుకువగు నీవు నాకు బుద్ధులు గఱపెదవా?

మీరా :—అమ్మా ! ఆపూజ్యునట్లు నిరసించుట న్యాయమా?

సుగు :—ఏమి ? నీకుఁగన్నులు తల కెక్కినవా ? ఉండు—నీపని జాగ్రత్తపెట్టెదను—రాణాకుఁ దెలియఁజేసి నిన్నుఁదగినట్లు శిక్షింపఁజేసెదను. (స్వగ మంచితరుణముదొరకినది ఈనాటి సంఘటనము రాణా కెఱింగించితినేని యీ మె నావలకు గెంటి వేయక మానఁడు.

దయా :—(మీరాబాయి నుద్దేశించి) కుమారీ! నేను పోవు చున్నాను భగవన్నామస్మరణము మానవలవని హెచ్చరించు చున్నాను.

(అనిపాడుచు నిష్క్రమించును.)

(అనుబంధము—)

సుగు :—జంకుగొంకులు లేక, పరపురుషుల నంతిపురములోఁ బ్రవేశపెట్టుచున్నావా ? రమ్ము. రాణాకడకు

మీరా :—అమ్మా ! నాయందు దోషములేదు. నిరపరాధ నగు నేను నాథునికడ కేమునకు ? పాండురంగని సేవించుట కాలయము లోనికిఁ బోయెదను (నిష్క్రమించును)

సుగు :—(స్వగ) ఈమెభక్తి నరికట్టవలయును. వైరాగ్య మును రూపుమాపవలయును. సోదరునితో నీమెయంతిపురిలోనికి విచ్చలవిడిగాఁ బరపురుషులను రప్పించుకొనుచున్నదని చెప్పెదను. ఆకపటసన్యాసిని ఘటుకు చేఁబట్టించి, చెఱయందుఁబెట్టించెదను. ఈ సుగుణాబాయి సామర్థ్యమింకను—మీరాబాయికి బాధపడ లేదు. తలం చినంతనే, నందినిబందిగను—బందినినందిగను జేయఁగలదీమె యని పాపమా నిర్భాగ్యురాలు గ్రహింపకున్నది. ఇఁక నేను తడయనేల ? రాణాను గలసికొని వానిచెవికీ వృత్తాంతమెక్కించెదను.

(నిష్క్రమించును.)

తెర పడును.

---

రెండవరంగము—రాణామందిరము

(ప్రవేశము—కుంభుఁడు—సుగుణాబాయి.)

కుంభు :—అక్కా ! విశేషము లేమి ? ఎన్నఁడు లేనిది నేఁడు నామందిరమున కిట్టిసమయమున వచ్చితివి ?

సుగు :—సోదరా ! సుప్రసిద్ధమయిన చిత్తూరురసపుత్రుల కీర్తిని నీవు కళంకిత మొనరించితివి—

కుంభు :—(ఆశ్చర్యముతో) ఆఁ—ఆఁ—ఏమనుచున్నావు ! సుప్రసిద్ధమయిన చిత్తూరురసపుత్రులకీర్తిని నేను కలంకిత మొనరించితినా ? అంతటిదుష్కార్య మాచరించితినా ?

సుగు :—మార్వారుదేశాధీశుని కొమరితను వెదకివెదకి వివాహము చేసికొంటివిగదా !

కుంభు :—అవును. అందు న్యూనతయేమున్నది ? మహావీరుఁడయి దిగంతయశోవిశాలుఁడై తనరిన భూపాలశేఖరుఁడా మార్వారు దేశాధీశుఁడు వానితోడి బాంధవ్యము గౌరవహేతు వేగద !

సుగు :—నేను—అగౌరవమని చెప్పుటలేదు. గౌరవ మేకావచ్చును. కాని నీవుకోరి పెండ్లాడిన యందకత్తె—మీరాబాయి

కుంభు—చెప్పుము. ఆలసింపక చెప్పుము.

సుగు :—చెప్పుటకేమున్నది ? సాటిరాజులాలకించిన తలవంపులు తెప్పువంతిదే !

కుంభు :—అన్నన్నా ! అంత ప్రమాద మేమొనరించినది ?

సుగు :—ఆమెకుమాత్రము ప్రమాదముగాఁ దోఁచుటలేదు. ప్రమాదముగనేయున్నది.

కుంభు :—అక్కా ! మీరాబాయి యేమిచేసి

సుగు :—ఏమియుఁజేయలేదు. మన వంశ కళంకిత మొనరించినది. అదిచాలదా ?

కుంభు :—(ఆత్రిముతో) అదెట్లు ? పరమభక్తురాలగు నామె కులమునకు చెఱుచు పాడుపని లేమిచేసినది ?

సుగు :—ఆమెభక్తియే యింతవఱకుఁ గొంప ముంచినది. శుద్ధాంతఃపురములలో సన్న్యాసులనుగూడఁ బ్రవేశపెట్టినది.

కుంభు :—(కోపముతో) ఏమేమి ? ఉత్తమస్త్రీలుండు నంతిపురములో సన్న్యాసులా ? ఎట్లురాఁగలిగిరి ?

సుగు :—ఎట్లురాఁగలుగుదురు ? కోరితీసికొనివచ్చిన రాఁగలుగుదురు రమ్మని కడుపుఁగాల్లఁబట్టుకొని బ్రతిమాలిన రాఁగలుగుదురు.

కుంభు :—అక్కా ! నీకుఁబుణ్యముండును. జరిగినవిషయము రను బూసగుచ్చినట్లు సవిస్తరముగా నాకెఱింగింపుము. నాహృదయమున వ్యాకులపాట ఘనమగుచున్నది

సుగు :—నాయనా ! అట్టిభార్య దొరకినపిమ్మట వ్యాకులపాటుకాక—సుఖము చేకూరునా ?

కుంభు :—ఏమి ? నాభార్యయే యట్టి యత్యాచారములకుఁ గడఁగినదా ?

సుగు :—కాక మఱియెవ్వరు ? ఇతరులకెవ్వరికా ధైర్యసాహసములుండును ? "నేనే పట్టమహిషిని—నేనెట్లుమెలఁగిన నన్నడ్డువారెవ్వరు ? నన్నుఁ బ్రశ్నించువారెవ్వరు ?" అనుగర్వ మామెకున్నది లేకున్నఁ జిఱకాలరక్షితములైన యంతఃపురసాంప్రదాయములకు విరుద్ధముగ, శుద్ధాంతఃపురములోనికిఁ గృత్రిమసన్న్యాసులను బిలిపించి వారితో ముచ్చటలా ?

కుంభు :—(జొదుఁగఱచుకొని) ఎంసాహస మెంతసాహసము ! (ఇంచుక సేపాగి) అక్కా ! అన్యుల నంతిపురమునఁ బ్రవేశపెట్టుటకుఁ గారణము ?

సుగు :—నాకేమి తెలియును ? నాయనా ! నీభార్యనడిగి తెలిసికొనుము. ఆమాయలాడియే కల్పనలు చేసి చెప్పుటకు సమర్థురాలు.

కుంభు :—ఆమె—పరమపురుషుని రాణివాసమునందు ప్రవేశ పెట్టినదని యెవ్వరు చెప్పిరి ?

సుగు :—ఒకరు చెప్పనేల ? ఘుంజేతికంకణమున కద్దమేల ? ప్రత్యక్షముగ నేను చూచితిని. చూచుటమాత్రమే కాదు. బెదరించి యాసన్యాసి నావలకుఁ బంపివేసితిని.

కుంభు :—అప్పుడు నీవు వాని రాకకుఁ గారణమడుగ లేదా ?

సుగు :—ఎవరు చెప్పెదరు ? ఎవరినడుగుటకుపీలు ? వీధినిబడి పోవుచున్న వానిని దానే పిలిపించితిననియు, భక్తివైరాగ్యములను వానినుండి యలవడఁజేసికొనఁగోరితిననియు నామె నాతోఁ జెప్పినది.

కుంభు :—(తలపంకించుచు) ఇదివఱలో నలవడిన భక్తివైరాగ్యములు చాలినవి కావా ?

(అంత నేపథ్యమున దయానందుఁడు)

॥ కామం క్రోధం లోభం మోహాన్
తత్త్వాత్మానాం పశ్యతి సోహాన్
ఆత్మజ్ఞానవిహీనా మూఢా
స్తేనస్సంతిచ నరకనిగూఢాః ॥భజగోవిందం॥

సుగు :—(వినుట నభినయించి) సోదరా ! సోదరా ! ఇతఁడే ! పాడుచు వీధింబడి పోవుచున్నయాతఁడే నేను చెప్పిన సన్యాసి. వాని నిటు బిలిపించి, మందలించుట మంచిది.

కుంభు :—(ప్రక్కకుఁజూచి) ఓరీ ! ఎవఁడురా ? అక్కడ—పుట్టాసింగూ ! నీవా ? ఇటురమ్ము.

(పుట్టాసింగు ప్రవేశము)

పుట్టా :—జయము జయము మహారాణావారికి.

కుంభ :—పుట్టాసింగూ! నీవు త్వరితగతినిబోయి—పాడుచు వీథింబడిపోవుచున్న యాసన్యాసి నిటుc దీసికొనిరమ్ము

పుట్టా :—చిత్తముప్రభూ!

(నిష్క్రమించును)

కుంభ :—అక్కా! ఇప్పుడు పాడుచుంబోవుచున్న యీసన్యాసియే యంతిపురముంజొచ్చినవాడని దృఢముగc జెప్పcగలవా?

సుగు :—చెప్పcగలను—వాcడేవీcడు; సందేహము లేదు.

కుంభ :—అట్లయిన వీనింబట్టి చెఱయందుంచెదను.

(అపుడు పుట్టాసింగు దయానందునితోc బ్రవేశము.)

పుట్టా :—జయముజయము మహారాణావారికి. ఆజ్ఞానుసార మీసన్యాసిని వెంటనిడుకొనివచ్చితిని.

కుంభ :—(దయానందు నవలోకించి) ఓరీ! నీవెవ్వcడవు?

దయా :—(మిన్నకుండును.)

కుంభ :—మాటాడవేల?

సుగు :—బెల్లముమొత్తినట్టాయి వలె నున్నాcడు. చూడు—వాని కెంతనిర్లక్ష్యమో!

పుట్టా :—దయ్యముపట్టినదా? లేక మతిపోయినదా?

సుగు :—మాటపడిపోయినది.

దయా :—అతిక్రాంతమర్యాదులతో నాకేమిపని?

కుంభ :—(ఉగ్రుcడై) ఔరా! ఏమి యెకండకావరము? హా గరు తలకెక్కినదా యేమి?

పుట్టా :—మూఢుcడా! చిత్తూరు మహారాణావారినే యతిక్రాంతమర్యాదు లనుచున్నావుగా!

దయా :—(మందహాసముతో) ఓయి, వెఱ్ఱివాcడా! గౌరవ మొకరిసొమ్ముకాదుగదా! అది సత్పురుషులనే కోరును.

కుంభు :—(అలహాసముతో) ఆహా! ఆహా! ఏమిసత్పురుషులు! తినుటకన్నమా—కట్టుగుడ్డయు లేక—తిరిపెమెత్తుకొనుచు బ్రొద్దుగడుపు ముష్టిముండకొడుకులు సత్పురుషులు! వారిని గౌరవమాశించుచు! ఇఁకఁ గావలసిన దేమున్నది!

దయా :—(మందహాసముతో) రాజా! సంపదకును సౌజన్యమునకును సంబంధమున్నదా? యాచనావృత్తిచేత జీవించునంతమాత్రమున—సత్పురుషులు నీకుఁ జులకనయితిరా?

కుంభు :—ఓరీ, అసందర్భప్రలాపీ! నీయిచ్చవచ్చినమచ్చున మాటాడకుము. నేనడుగుప్రశ్నలకు సమాధానమిమ్ము. రాజాంగనలుండు శుద్ధాంతఃపురములో నెందుకుఁబ్రవేశించితివి?

దయా :—పట్టమహిషియు. భక్తురాలునగు మీరాబాయి, త్రోవంబోవుచున్ననన్నుఁ దనచెలికత్తెచేత. బిలిపింపఁగా బోయితిని. అందుఁ దప్పేమున్నది?

సుగు :— ఓ కపటసన్యాసీ! నీవెవరిసమ్ముఖమున మాటలాడుచున్నావో, తెలిసికొనుము.

పుష్ప :—శాశీభూత విద్వేషిరాజని యనఁదగు చిత్తూరు మహారాణానే లెక్కసేయవుగా?

దయా :—(మందహాసముతో) అయ్యా! రిపుషడ్వర్గమునడంచుకోఁజాలని మీమహారాజును నేనేల లెక్కసేయవలయును?

సుగు :—సోదరా! వింటివా వీనిమాటలు! గ్రహించితివా వీనిదౌర్జన్యము!

కుంభు :—(కోపముతో) ఓరీ! మూర్ఖుఁడా! ఏవాఁడనోయాచించుకొని సుఖముగఁ బ్రొద్దుఁబుచ్చుభాగ్యము నీకులేదు. రాణివాసముం బ్రవేశించి శిక్షార్హుండవయితివి నీకాలుసేతులం గలుఁ గట్టించి, నిన్నుఁ జెఱసాలం ద్రోయించెదను.

దయా :—(మందహ సముతో) రాజా !

సీ. సర్వలోకేశుఁడౌ ♦ శౌరిబాల్యమునందుఁ
చిందుఁద్రొక్కిన దివ్య ♦ చిత్రశాల !
సత్యాగ్రహోద్యమ ♦ సంయుగారంభుఁడై
రామదాసువసించు ♦ లలితసీమ !
స్వీయస్వతంత్రంబు ♦ బాయనొల్లక తొల్లి
సంయుక్తమెట్టిన ♦ స్వచ్ఛభూమి !
భారతదేశ స ♦ ద్గౌరవంబాశించి
ధీరులువిడిసిన ♦ వీరగృహము !

గీ. అయిన చెఱసాలయనినంత ♦ నడలవేల ?
కడఁగి బంధంత వీవు నా ♦ కాలుసేతు
లంటియేకాని-భావంబు ♦ లడ్డఁగలవె ?
చేసికొనుమీవు వేడ్క నీ చిత్తవృత్తి !

కుంభు :—(స్వగ) ఔరా ! ఎంతనిర్భయముగ మాటలాడు చున్నాఁడు. ఏదియెట్లుజరిగినను-వీనినిప్పట్లఁ గారాగృహంబుననుంచుటయే మంచిది. (ప్రకా) పట్టాసింగూ ! ఇంకనుజూచుచున్నావేల ? ఈతుచ్ఛునిందోడ్కొనిపోయి, చెఱయందుంచుముఁ

పుట్టా :—చిత్తము మహాప్రభూ ! (దయానందునితో) ఓ సన్యాసీ ! తప్పుక్షమింపుమని రాణావారిపాదములపైఁబడి ప్రార్థింపుము వారు శరణాగతత్రాణులు కరుణాసముద్రులు.

దయా :—ఓయి వెఱ్ఱివాఁడా ! అంధుఁడు వేఱొకయంధునకుఁ దోవఁజూపలేఁడు; ఒకదోషి వేఱొకదోషిని క్షమించలేడు.

పుట్టా :—నీకర్మము — నేనేమిచేయఁగలను ? నీనోటినుండి యున్మత్తాలాపములు వెలువడుచున్నవి-రమ్ము.

దయా :—(ఆకసమువంకఁజూచి) రంగా! పాండురంగా! నీ సంకల్ప మీవిధముగనున్నదా ?

(పుట్టాసింగుతోఁగూడ నిష్క్రమించును.)

కుంభ :—అక్కా! నేసించుక సేపు నిద్రింతును—నీవేఁగుము. సావకాశముగా మీరావిషయమై యాలోచించుకొనవచ్చును.

సుగు :—మంచిది.

(నిష్క్రమించును.)

తెర వ్రాలును.

చతుర్థాంకము సంపూర్ణము.

——

శ్రీరస్తు.

# మీరాబాయి

## పంచమాంకము.

మొదటిరంగము—అంతఃపురము.

(ప్రవేశము—నళిని—సుగుణాబాయి.)

సుగు:—ఏమే, నళినీ! ఇంత పెందలకడనే లేచిపోవుచున్నావు! మీదేవిగారు తిరిగి యేసన్న్యాసులనైన బిలుచుకొని రమ్మనిరా?

నళి:—(సందేహమభినయించుచు.)

సుగు:—సందేహమెందులకు? చెప్పుము. ఆమెచర్యలను నీవలనఁ దెలిసికొనవలెనని రాణా నాకనుజ్ఞ యిచ్చెను.

నళి:—అమ్మా! మీరెఱుంగని విషయము లేమున్నవి? అమాయకురాలనగు నానోటినుండి చెప్పింపఁజూతురేల?

సుగు:—నేనెఱింగినయెడల నిన్నుఁబ్రశ్నింతునా? చెప్పుము.

నళి:—అమ్మా! పట్టమహిషిప్రవర్తనమంతయు నాశ్చర్యకరముగనున్నది.

సుగు:—అట్లనుటకు హేతువు?

నళి:—హేతువునకేమున్నది? రాత్రియనదు— పవలనదు. ఎల్లప్పుడు విధివిరామములులేక, పాండురంగని ప్రతిమను మ్రోలఁ బెట్టుకొని, పాటలుపాడుచుండును. భజనలు సేయుచుండును. ఫలము

లను బంధించి పెట్టుచుండును. సాయంకాలముగుసరికి, — చందనుచులు సింగారించుకొని శయనాగారముల బ్రవేశించుటకు సిద్ధపడుచుం దురు. ఈమెకట్టిపి కొట్టు—జడలోఁబెట్టుకొమ్మని పూలందెచ్చినంతనే, వానినా కొయ్యబొమ్మపైఁబెట్టును. పరిమళద్రవ్యములంగొని తెచ్చి మోలిఁబెట్టఁగా వాని నా బొమ్మ కుపయోగించును

సుగు :—నళినీ! అనుదినమామె యిట్లుచేయుచున్నదని నేను దెలిసికొంటిని—కాని యీదినమున వేకువజామునందే నీవు లేచి యామె మందిరమునకుఁ బోవుచుండుటకు గారణము ?

నళి :—అమ్మా! దేవిగారీపూట వేదసాధువుకు వస్త్రములను దానముసేయుదురట !

సుగు :—ఎక్కడ? ఎక్కడ? ఆమె స్వయముగా నా సీధి లోనికేఁగునా ?

నళిని :—ఆమె వెడలదు దాసీగుమ్మముకడఁగాచి— దాసీని బోవు బచ్చగాండ్రనెల్లరను దోడ్కొనిరావఁ సినది. నాకాజ్ఞాపించి నది. అందువలన నింతపెందలకడ లేచితిని.

సుగు :—(ఆశ్చర్యముతో) ఎక్కడకు. దోడ్కొనిరమ్మని నీ కాజ్ఞాపించినది ?

నళి :—అంతిపురిలోనికి—

సుగు :—ఈ సాధ్య నంతఃపురముఁ బ్రవేశించిన యాసన్యాసి చెఱలోనున్నాఁడను విషయము మీ దేవికిఁ దెలియునా ?

నళి :—తెలియుకేమి ? తెలియుటమాత్రమేకాదు. ఆమె చెఱ సాలకుఁబోయి యాతనినూఱడించుటయు జరిగినది.

సుగు :—(స్వగ) ఈమెపై నాకుఁగలపగ సాధించుకొనుటకు సమయము చిక్కినది.

నళి :—అమ్మా! నాకనుజ్ఞయిత్తురా ?

సుగు :—(మెడలోనిహారముదీసి యిచ్చును) ఈహారమును వైకొనుమా—పొమ్ము. అప్పుడప్పుడు నన్నుగలిసికొనుచుండుము.

నళి :—(హారమందుకొని సంతోషముతో) చిత్తము.

సుగు :—బిచ్చగాండ్రను దీసికొనివచ్చుటకే పోదలచితివా?

నళి :—అవును. పట్టమహిషి యనుమతి నతిక్రమింపవీలా ?

సుగు :—(తలయూంకించి) మంచిది—పొమ్మురమ్ము.

(నళిని నిష్క్రమించును)

సుగు :—(స్వగ) రాయనుమతి లేనిదే, కుంభుడు మర్వారు దేశమేగి యీ మెనుగోరి పెండ్లాడినాడు. అందువలన నీమెపై నాకు ద్వేషముంకురించినది. నేనీ రాజుకే రాణాను విశాలపురరాజపుత్రికను బత్నిగాజేసికొమ్మని చెప్పితిని. నామాట నాతడు పాటింపలేదు. కనుక నెట్లయిన నీమెను నగరునుండి యావలకు సాగనంపినగాని నాకుగంటికి నిద్రరాదు. నేనిప్పుడు రాణాను దోడ్కొనివచ్చి యంతిపురములో జరుగనున్నదానిం బ్రత్యక్షమొనరింతును.

(నిష్క్రమించును.)

తెర పడును.

---

రెండవరంగము—అంతఃపురము

(ప్రవేశము— మీరాబాయి—నళిని)

మీరా :—నళినీ ! ఆవినబడుచున్న కేకలు వారివేనా ?

నళి :—దేవీ ! నీవు పంచిపెట్టిన వస్త్రాభరణములనందుకొని సంతోషము పట్టజాలక బిచ్చగాండ్రు జయజయధ్వానము లొనరించుచున్నారు. (ప్రక్కకుజూచి) అహో ! నేలయీనినచాడ్పున భిక్షు

కులెందఱువచ్చిరో! ఆకసమునందలి చుక్కలనయిన లెక్కపెట్టవచ్చును—కాని—అమ్మా! నేఁడు నీవలన నాదరింపఁబడిన యీపేదలను లెక్కించుట కలవిగాదుగదా!

మీరా:—(ప్రక్కకుఁజూచి) ఆహా! భారతదేశ మెంతటిదురవస్థ ననుభవించుచున్నది! ఒక్కచిత్తూరులోనే నిఱుపేదలు వేనవేలున్నఁ దక్కుంగల హిందూదేశమున నెందఱుందురో! అయ్యయ్యో! ప్రాచీనవైభవము నశించుటచే భారతీయుల కెట్టియిక్కట్లు ప్రాప్తించినవి!—నళినీ!

సీ. ఖండఖండాంతర ♦ ఖ్యాతిసంపాదించి
యాదర్శపురుషులై ♦ యలరినారు!
అమరేంద్రభోగులై ♦ యాంధోళికలనెక్కి
యేనుఁగీవుల నేల ♦ నేలినారు!
పరదేశవాణిజ్య ♦ బాహుళ్యసంప్రాప్త
ధనముచేతఁ గుబేరుఁ ♦ దన్నినారు!
మత్తారిరాజన్య ♦ మకుటాలిశీర్షమై
వామపాదము మోపి ♦ ప్రబలినారు!

గీ. నాఁటి మనభారతీయులే ♦ నాఁడు—దాస్య
పాశబద్ధులై—పరతంత్ర ♦ బాధలనఁ
గడుపునకుఁ బట్టెడన్నము ♦ గట్టుగుడ్డ
కొదువగాఁ గుందుచున్నారు ♦ కోమలాంగి!

నళి:—అమ్మా! నేఁడు నిఱుపేదలకిందఱకి వస్త్రాభరణముల నొసంగి పుణ్యము సంపాదించితివి. భారతదేశములోఁ బ్రబలదారిద్ర్యము నిన్నుఁబోలినవారివలనఁ గొంతయయిన నివారణకాఁగలదు. కాని యిదేమిపాపమో! నీచర్యలు వదినగారికి నామెతోఁబాటు మహారాజుగారికిఁగూడ నాదరణీయములు గాకున్నవి.

మీరా :—నళినీ! ప్రతివ్యక్తికి నాత్మస్వాతంత్ర్యముండవలయును. మనము తలపెట్టుకార్యము మంచిదైన నన్యులకు భయపడనేల? అంతఃపురప్రవేశ మునరించెనన్న నేరమునుమోపి రాణావారు దయానందయోగీశ్వరుని జెయిలోఁబెట్టించిరిగదా! అతఁడేమైన నంజలించినాఁడా? అపూర్వాత్మునొక్కనిగుఱించి యాలోచింపుము.

సీ. ఆత్మస్వతంత్రంబు ♦ నభిలషించుమహాత్ముఁ
డోడెనే? చట్టాల ♦ గోడఁజూచి
స్థిరకీర్తి వాంఛించు ♦ చిత్తరంజనుఁడుదాఁ
జెయిపాలయనినంత ♦ వెఱఁగుపడెనె?
భారతావని గౌర ♦ వముఁగోరు లోకమా
న్యుఁడు రాచపీడకు ♦ జడిసినాఁడె?
స్వారాజ్యమూహించు ♦ సదయాంతరంగుండు
జవహరిసుఖములఁ ♦ దవిలినాఁడె?

గీ. పూని, త్యాగంబునల్పైడు ♦ పుణ్యమూర్తు
లెన్నఁటికిఁ దెగించినవారె ♦ యగుదురనినిఁ
గష్టములఁగాంచి మదియందుఁ ♦ గలఁగరెపుడు,
అసువులనువీడ వెనుదీయ ♦ రవసరమున.

(అంత నేపథ్యమున)

"అమ్మా! నూజేండ్లుపైఁబడ్డ ముసలిముండను—కడుపునకన్నము లేగు—కట్టుటకు గుడ్డ లేదు"—

మీరా :—(ఆలకించి) నళినీ! పాపమా వృద్ధురాలెట్లు మొఱపెట్టుచున్నదో—పొమ్ము. ఆమెను దీసికొనిరమ్ము.

నళి :—(నిష్క్రమించి, యొకవృద్ధభిక్షుకురాలితోఁ బ్రవేశము—)

నళి :—అమ్మా ! ఈమె శతవృద్ధ—నేడో, రేపో రాలనున్న పండు.

వృద్ధు :—అమ్మా ! నూఱేండ్లుపైబడ్డ ముసలిముండను—కను పైన కన్నులేదు కట్టుటకు గుడ్డలేదు.

మీరా :—(ఆదరణతో) అవ్వా ! నీవు విచారింపకుము. నీకు జీవితాంతమువరకు సాపాటు వస్త్రాదుల నొసంగుదును.

(ఆకస్మికముగఁ దెరలో)

"కొట్టుఁడు—పట్టుఁడు—పొడువుఁడు."

మీరా :—ఆఁ; ఆఁ; ఏమది ? ఎవరది ?

నళి :—(ప్రక్కకుఁజూచి, భయముతో) అమ్మా ! అమ్మా ! ఇంకేమున్నది ?

మీరా :—ఏమి ? ఏమి ?

నళి :—(ప్రక్కకుఁజూపుచు) కొంపమునిగినది; మహారాజుగారిటు వచ్చుచున్నారు. బిచ్చగాండ్రసంతతిని బట్టుకొని కొట్టదిట్ట నాజ్ఞాపించుచున్నారు

వృద్ధు :—(భయముచే వడఁకుచు) అమ్మా ! అమ్మా ! నా గతి యేమి ?

మీరా :—అవ్వా ! నీకు భయములేదు—మహారాజుగారు వృద్ధురాలవగు నిన్నేమియుఁ జేయరు.

(అప్పుడు రాణాయు సుగుణాబాయియుఁ బ్రవేశము)

సుగు :—సోదరా ! అంతఃపురమును సత్రముగాఁదలఁచి, లోనంబ్రవేశించినందులకు వారికిఁ దగినశాస్త్రియే జరిగినది. ఇక్కడ నింకనొకముసలిముండ మిగిలియున్నది. దీనినిగూడ శిక్షింపవలయును. (సమీపించి) ఛీ ! ఛీ ! ఈముండదగ్గఱఁ గంపు ! చెడుకంపు ! ఇట్టివారిని శుద్ధాంతఃపురములలోఁ బ్రవేశపెట్టుటా ?

కుంభ :—అక్కా ! నీవు శాంతించుము— ఈ యవినీతికార్యము నంగీకరించుచు—ముందీ ముసలిదానికి బుద్ధిచెప్పనిమ్ము.

మీరా :—(వృద్ధురాలి కడ్డునిలువబడి భగవంతునుద్దేశించి దీనముగా) హే దీనమందారా! ఆర్తత్రాణపరాయణా! పాండురంగా!

సీ. కాళ్లు సాగవు—శతవృద్ధ— ♦ కండ్లు లేవు
కూడుగుడ్డలు దొరకమి ♦ మాడుచుండెఁ
బిలిచి వస్త్రాదికము లీయఁ ♦ దలఁచినంతఁ
గోపమున నాథుఁడరుదెంచి ♦ కొట్టుచుండె.

దేవా! ఆమె కెవ్విధమైన బాధలు గలుగకుండఁ గాపాడి సార్థకనాముఁడవు గమ్ము.

కుంభ :—(కోపముతో) ముసలిముండా! నీవెందుల కంతఃపురములోనికి వచ్చితివి ?

వృద్ధు :—(వడఁకుచు) బాబూ! బాబూ! అమ్మగారు—పి—లిపిం—చి—నా—రు.

కుంభ :—(మహోగ్రుఁడై)

శా. ముండా! ఏమిటికిట్లు ప్రేలెదవు? సం ♦ పూజ్యంబుసౌధంబు; మా
యందంజేరఁగ సాహసంబొదవెనే? ♦ యత్యంతదౌర్భాగ్యవై
చండాలత్వముతోడ నంటియుదు రా ♦ జాస్థానముం జేరెదే?
ఖండింతుఁగద! నీదుమస్తకము నే ♦ శౌర్యంబు దీపింపఁగన్.

సుగు :—సోదరా! మాటలతోఁ గార్యములేదు—కాయశుద్ధిని జేయుము.

మీరా :—వదినగారూ! వృద్ధురాలినిగొట్ట—

కుంభ :—(అర్ధోక్తిలోనే కోపముతో) నీవూరకొనుము. (వృద్ధురాలితో) ఓసీ! ముష్టిముండా! బాలేందుప్రభాజాలమయునఁ బరిన

రింపవీలు లేని చిత్తూరురాణీవాసమునఁ బ్రవేశించితివా ? (అని కొట్ట నుద్యమించుచున్నాఁడు.)

వృద్ధు :—బాబూ! బాబూ! అమ్మా! రక్షింపుఁడు-రక్షింపుఁడు—అపరాధము—దిక్కు మాలినదీనను.

మీరా :—(వృద్ధురాలి కడ్డుగానిలువఁబడి) మహారాజా! ఈమెను వస్త్రములనీయఁ గోరి నేనేపిలిపించితిని ఆమె నిరపరాధ. దోషము నాది. నన్ను శిక్షింపుఁడు.

సుగు :—(కోపముతో) శిక్షమాత్రము తప్పునా ? ముందీమ సలిముండకు బుద్ధిఁజెప్పనిమ్ము—సోదరా ! తొందరయేల ? కత్తి చే నా వృద్ధురాలికుత్తుకను దెగనఱుకము.

వృద్ధు :—(భయముచే వడఁకుచు) అయ్యో ! అయ్యో !

మీరా :—(భర్తనవలోకించి) నాథా !

ఉ. అర్థులమీఁదఁ జూవఁదగు ♦ నా? భవదీయపరాక్రమంబు; ప్ర
త్యర్థులఁడాసి యుద్ధసమ ♦ యంబునఁజూపిన. జెల్లుఁగాక; సం
వర్ధిత భూరిభూజముల ♦ వ్రక్కలుసేయు ప్రభంజనుండు తా
నర్థిఁజెకల్చునే తృణల ♦ తావళులన్ ! మదినూహ సేయుమా?

కుంభ :—(కోపముతో నామెను బ్రక్కకుఁద్రోసి) నీవూరకుండుము. నీకతంబునఁ జిత్తూరు శుద్ధాంతఃపురము సత్రముగా మాఱి పోవుచున్నది. ముందీవృద్ధురాలినిదండించి పిమ్మట నిన్నుగుఱించి యాలోచించెదను. (అని వృద్ధురాలిజుట్టు నొకచేతఁబట్టుకొని, వేఱొక చేతఁ గత్తిఁబూని)

మ. అతులక్ష్మాతల నాథుగేహమున నీ ♦ వాహా ప్రవేశింపఁగా
మదిలో సాహసమూనినావె ? సరినీ ♦ ప్రాణంబులిప్పట్ల; దు
ర్గతిపాలౌదువటంచెఱుంగవసిచేఁ ♦ గంఠంబు లుంఠించి, ని
ర్గతి కోపాన్వితచిత్తమూనెదను, రా ♦ కాసీ! యిదే చుమ్మనన్.

(అంత నాకస్మికముగా నేపథ్యమున—)

గీ॥ "భద్రదంతావలం బొంకు ♦ బంధములను—
పూని ఛేదించివివశమై ♦ పురములోని
ప్రజలఁ బదతాడనంబున ♦ రాయుచుండెఁ
దెల్పుఁడీ వార్త వేగఁ బా ♦ర్థివున కిపుడు"—

కుంభు:—(వృద్ధురాలినివిడిచి తొట్రుపాటుతో) ఆఁ— ఆఁ— నాదపుటేనుఁగునకుఁ బిచ్చిపట్టినదా?— అక్కా! ముందు నేను పోవుచున్నాను—దానిని బట్టుకొనుటకుఁ దగిన ప్రయత్నము లొనరింపవలయును—(నిష్క్రమించును) ప్రయత్నా

సుగు:—(స్వగ) ఈ ముండను నఱికినపిమ్మటఁ గంచుకి యీ వార్తను జెప్పరాదా?...... ఈ ప్రయత్న మిప్పట్ల విఫలమయినది. క్రొత్తకల్పన జేసి యీ మీరా నంతిపురినుండి వెడలఁగొట్టుటకే చూచెదను. (నిష్క్రమించును—)

మీరా:—(పైకిఁ జూచి) అహో! రంగా! నీ లీలలు దురవగాహములు! నీ చర్యలత్యద్భుతములు! ఈ వృద్ధురాలి కుత్తుకపైఁబడనున్న కత్తిని దప్పించితివి.

వృద్ధు:—అమ్మా! ముష్టిముండనగు నా మూలమున నింత గందరగోళ మేల?

మీరా:—వెఱ్ఱిదానా! నీవు భయమునొందకుము. కరుణామయుండగు నా పాండురంగఁడు నిన్ను సంరక్షించినాఁడు—రమ్ము—ఆవలి గదిలోఁగల వస్త్రాదికములొసంగి—నిన్ను సాగనంపెదను.

వృద్ధు:—అమ్మా! నాకు వస్త్రాదికములు వలదు—నన్నుఁ బోనిండు—మరల మహారాజుగారువచ్చిన నా కాయువు మూడును.

మీరా:—అవ్వా! నీవు భయపడక నా వెంటరమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

---

## మూఁ డ వ రం గ ము.

ప్రవేశము—నళిని

నళి:—(తనలో) నిన్న శుద్ధాంతఃపురములోనికి బిచ్చగాండ్రను ప్రవేశపెట్టినందులకే—మహారాణావారు మహోగ్రులై వారి నెల్లరను జావబాదిరి—మరల నేఁడిదేమి? పిచ్చిపిచ్చి పాటలను బాడుకొనుచు దేవిగారు—తాను రాజమహిషినన్న జ్ఞానము సుంతయు లేక - ఆలయము లోనికేఁగుటా? భజనసేయుటకు వచ్చిన సోమదత్తుఁడామె గానమున కచ్చెరువంది యొక యమూల్యరత్నహారము కానుకగా నొసంగుటా? బాగు బాగు! ఈ విషయము సుగుణాబాయి యాలకించినచోఁ దప్పక రాణావారికిఁ జెప్పి యీమె నీ పర్యాయము అంతఃపురమునుండి సాగనంప గలదు......కానిమ్ము......(ముందుఁ జూచి) అదిగో! ఆమె యీవైపునకే వచ్చుచున్నది. మొన్న బిచ్చగాండ్ర వార్త చెప్పినందులకే నాకొక హారమిచ్చినదీమె! నేఁడీ వార్తను దెలియఁజేసిన నింకేమి కానుక నొసఁగునో!

(అపుడు సుగుణాబాయి ప్రవేశము—)

సుగు:—ఏమే నళినీ! విశేషము లేమి? నిన్న నా వృద్ధురాలికి మీ యమ్మగారు వస్త్రదాన మొనరించిరా?

నళి :—ఈ అందములకు లోటేమి? ఆ ముసలిముండ లేచినవేళ మంచిది—సమయమునకే పట్టపురాణిగారు ప్రజలపైబడి చాల రేగినదని కంచుకి యరుచినాడు—లేకున్న మహారాజుగారి చేతులమీదుగా యమలోకమునకు బోయియుండెడిది.

సుగు :—నేటి విశేషము లేమి? మీరాదేవిగారు ఉదయముననే, పాటలు పాడుచు భజనమందిరముం బ్రవేశించిరి. అటకుగల పురుషు లెవ్వరు?

నళి :—(మిన్నకుండును)

సుగు :—సందేహింపకుము—ఉన్నదున్నట్లు వచింపుము—నీవు తరువాత నా గదికివచ్చిన నీకు మంచికానుక నిత్తును

నళి :—అమ్మా! మీరాదేవి భజనమందిరములోని కేగినపుడు అట సోమవస్త్రుడను వణిజుడున్నాడు

సుగు :—వాని రాకకు గారణము?

నళి :—దేవియొక్క యపూర్వగానమాలకించుట—అతడు వెలకట్టరాని రత్నహారమొండామెకు గానుకగా సమర్పించి, వెడలిపోయినాడు.

సుగు :—మీరాదేవికా? రత్నహారము కానుకా?

నళి :—అగును.

సుగు :—(నిమీలితనేత్రయై యాలోచన మభినయించి) నళినీ! ఆమె యాహార మేమిచేసినది?

నళి :—మెడలో ధరింపలేదు—మందిరములోగల పాండురంగ ప్రతిమ కలంకరించినది.

సుగు :—నళినీ! నీవు నాకొక యుపకారము సేయవలయును

నళి :—సెలవిండు.

సుగు :—తప్పక చేయఁగలనని బాసచేయుదును.

నళి :—చిత్తమట్లే.

సుగు :—నీవు పోయి మీ దేవి చూడకుండ నా హారమును దెచ్చి నాకీయవలయును. ఆమె కెఱుకపడఁగూడదు.

నళి :—అమ్మా ! మీ రిక్కడ నేయుండుఁడు—నే నయిదు నిమిసములలో దానిం గొనివచ్చెదను.

సుగు :—మంచిది—పోయిరమ్ము—వచ్చునప్పుడు మీ దేవి యేమి చేయుచున్నదో కనిపెట్టుము.

నళి :—చిత్తము—(నిష్క్రమించును)

సుగు :—(స్వగ) ఇన్నిదినములకు నా యత్నము ఫలించినది. నే నీ రత్నహారముతో నొకచిత్రనాటక మాడెదను. మీరాబాయి కాయువయినఁ జెల్లవలయును—లేదా ? ఆమె చిత్తూరు పొలిమేరల దాఁటి పోవలయును - ఈ రెండింటిలో నొకటి తప్పదు - సోమదత్తునికి మీరాబాయితో సంబంధమున్నదని చెప్పుటకు నాకీ హారము నిదర్శనముగ నుపయోగపడఁగలదు - (ముందుఁ జూచుచుండును)

(అంతఁ గొంతసేపటికి రత్నహారముతో నళిని ప్రవేశము.)

నళి :—అమ్మా ! చూచితిరా ? ఈ హారమునకు వెలఁగట్టుట కెవ్వరికి శక్యము ? (ఇచ్చును.)

సుగు :—(పుచ్చుకొని తనలో సంతోషముతో) మా సోదరుఁ డిదివరలో దీనిం జూచినాఁడు. క్రయమునకు దన కిమ్మని సోమదత్తుని గోరినాఁడు ఆతఁ డిష్టపడక వేరొకటి తెచ్చి యర్పింతుకొనెదనని బదులు చెప్పినాఁడు. (ప్రకా) నళినీ ! మీ దేవి యేమిచేయుచున్నది ?

నళి :—అమ్మా ! క్రొత్తఁగాఁ జెప్పవలయునా ? ఎప్పటిచర్యలే మందిరమునఁ గూరుచుండి యొడిలో రంగని విగ్రహముఁ బెట్టుకొని ముద్దులాడుచున్నది.

సుగు :—(తల పంకించి) సరే నీ వికఁబొమ్ము తరువాత నన్ను గలిసికొమ్ము - ఈ విషయ మెవ్వరికిఁ జెప్పవలదు.

నళి :—చిత్తము—(నిష్క్రమించును.)

సుగు :—నేనిఁక. దడయరాదు - ఈ రత్నహారము ను రాణాకు జూపింతును - మీరాబాయి తన్మయత్వముతోఁ దన మందిరమునఁ గూరుచుండి ప్రలాపించుచుండును - సోదరుని వెంటనిడుకొనివచ్చి దూరమున నిలువఁబెట్టెదను. ఆతఁడా పలుకుల నాలకించి - నిశ్చయముగ నామె పరపురుషునితోఁ బ్రసంగించుచున్నదని భావింపఁగలఁడు. అపుడామెకు శిరచ్ఛేదము—నా కాహ్లాదము!

(నిష్క్రమించును)

తెర పడును.

---

## నాల్గవ రంగము—శయనాగారము

(ప్రవేశము—రాణాకుంభుఁడు)

కుంభు :—(స్వగ) అక్కటా! ఏ యలజడియు లేక - ప్రశాంతమయమయిన శుద్ధాంతఃపురమున నెట్టిచిత్రవిచిత్రసంఘటనము లుదయించినవి! కొఱవితోఁ దల గోకికొన్నట్లు - కోరి తెచ్చిపెట్టుకొంటిని భార్యను - ఈమెవలన సుఖము రవ్వంతయు లేదు - మీదుమిక్కిలి సౌందర్యవతియగుటచే నామెం గాంచినంతనే - నాకు మదనసంతాపమినుమడించును. అద్దానిం బాపుమని యామె నెంతబ్రతిమాలినను - లాభ మావంతయు నుండదు. ఇఁక నామెతో వేఁగుటయెట్లు? అడవి

గాఢిన వెన్నెలవలె నా జవ్వనమిట్లు గడచిపోవలయునా? (ఆలోచన మభినయించుచున్నాఁడు.)

(అపుడు తొందరగా సుగుణాబాయి ప్రవేశము.)

సుగు :—వింటివా? సోదరా! వింటివా?

కుంభు :—(ఉలుకుపడి) ఏమది?

సుగు :—(విషాద మభినయించి) అయ్యో! ఇఁక నేమున్నది? పంకువంటి కులము పాడుమీరావలనఁ గళంకితము యినది.

కుంభు :—అక్కా! మరల నెవ్వరినయిన నంతఃపురమునఁ బ్రవేశపెట్టినదా?

సుగు :—(నోరు నొక్కుకొనుచు) ఎట్టి యపకీర్తి వాటిల్లినది! నీ వీ విషయమునువిన్న నామెను ముక్కముక్కలుగ తఱిగి కాకులకు గ్రద్దలకు నెగుర వేయకుందువా?

కుంభు :—ఆఁ- ఆఁ- మీరా యింతటిశిక్షకుఁ బాత్రురాలా?

సుగు :—పాత్రురాలగునో, కాదో నాకుఁ దెలియదు. ఆమె చేసినపనియిది. ఈ యూరిలోఁగల సోమదత్తుఁడనువాఁడీ రత్నహార మును - (ఇచ్చి) హరహరా! నా నాలుక వేయిచీలికలుగాను! చెప్పుటకు నోరు రాకున్నది.

కుంభు :—(హారముంజూచి ఆశ్చర్యముతో) అక్కా! అక్కా! ఈ హారము నీ కెట్లు చిక్కినది? నే నెంతఁగా నొక్కిచి యడిగినను - ఆ వణిజుఁడు నాకు విక్రయించుటకు సమ్మతింపలేదు.

సుగు :—సోదరా! నీవు మాఱుమాటాడకుము. రమ్ము నా వెంటరమ్ము.

కుంభు :—(ఆగ్రహముతో) ఎక్కడకు? ఎందులకు?

సుగు :— నీకు సత్యమెఱుఁగుటకుఁ గుతూహలమున్న నా వెంటరమ్ము. నే నెక్కడికిఁ దీసికొనిపోయిన నీకేమి? నీవు మాత్రము నా యనుమతి లేనిదే యెవ్విధమయిన సాహసమునకుఁ బూనరాదు. తుదకుఁ బెదవులను గదల్పరాదు.

కుంభు :—సరియే. రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

---

ఐదవ రంగము—మీరాబాయి మందిరప్రాంతము.

(ప్రవేశము—సుగుణాబాయి—కుంభుఁడు.)

కుంభు :—అక్కా! నీ చర్య నాకు దురవగాహముగానున్నది. ఈ యర్ధరాత్రమునఁ జీఁకటిలో నన్నీ మందిరప్రాంతమునకుఁ గొనివచ్చితివేల?

సుగు :—సోదరా! వ్యాకులమనస్కుఁడవు గావలదు. గట్టిగా మాటలాడకుము - అడుగుఁ జప్పుడుగాకుండ మెల్లఁగా నీ మందిరకుడ్యము నానుకొని నిలువఁబడుము - రమ్ము

కుంభు :— (మెల్లఁగ) అక్కా! ఈ మందిరములో నిపుడెవరున్నారు?— మీరాబాయి యిపు డిందు శయనించుటలేదా?

సుగు :—సోదరా! నీ చేతికిచ్చిన రత్నహారమును సోమదత్తుఁడు మీరాబాయి కిచ్చినాఁడు—ఆమె వానికి లోఁబడి యిపుడీ మందిరమున...... విను - విను - పెదవులఁ గదపక - మెల్లఁగ వినబడుచున్న వారి సంభాషణ మాలింపుము.

కుంభు :—(నిర్వేదపాటుతో వికట నభినయించును.)

(అంత మందిరాంతర్భాగమున మీరాబాయి.)

"మనోహరా! రమ్మి - ఒక్క ముద్దిమ్మి - తనివిదీర నన్ను నీ కౌఁగిటఁ జేర్చికొమ్మి"

కుంభు :—హా మీరా! మీరా! (ఉద్రేకముతో) అక్కా! అక్కా! చాలును - బోధపడినది

(అంత మరల నేపథ్యమున.)

"అయ్యయ్యో! నీ వియోగము నాకు దుస్సహము".

కుంభు :—హా మహాపాతకీ! రాక్షసీ! మీరా! సుప్రసిద్ధము— అతిపునీతమునగు సుక్షత్రియకులమున నీ వెట్లుజన్మించితివి? పతివ్రతా శిరోమణులను బ్రసవించిన భరతమాత చండాలి వగు నీ కెట్లు లాశ్రయమిచ్చినది? కళంకమెఱుఁగని చిత్తూరు రసపుత్రసద్యశము నేఁడు నీ సంబంధమున మాలిన్యముఁబొందినదే! పాపాత్మురాలా!

నిరుపమాన సౌందర్య తేజోరాశివి నియు సద్గుణవతివనియు దలచి నా కానందమొసఁగూర్తువని నిన్నుఁ గోరివరించినందులకిదియా ప్రతీకారము? దుష్టురాలా! నీవు భక్తురాలవన్న మాట మిధ్యగాదా? నీకు వైరాగ్యమెక్కడిది? అబ్బా—అబ్బా—తలంచినంతనే గుండెలు బద్దలగుచున్నవి.........అక్కా—అక్కా— మెల్లఁగా నన్నుఁగొని పోయి శయనాగారమునఁ జేర్పుము ఆతుచ్ఛురాలిని జిత్తూరువిడిచి యీక్షణమునందే పోవునట్లులోక యాజ్ఞాపత్రమునువ్రాసి యందఁ జేయుదును. అంతవఱకు నాకు శాంతియుండదు. అబ్బా—తలతిరుగుచున్నది. ఒడలు వడఁకుచున్నది. నా భుజమును బట్టుకొనుము.

(సుగుణాబాయి రాణానుదీసికొని పోవును)

తెర వ్రాలును.

---

అంతరంగము—శయనాగారము.

(మీరాబాయి లేచి కూరుచుండఁగా, నళిని చెంత నిలువఁబడియుండును.)

మీరా :—నళినీ! ఈయర్ధరాత్రి సమయమున నిట కేలవచ్చితివి? నీహస్తమునందలి లేఖయేమి?

నళి :—దేవీ! సుగుణాబాయమ్మ నిద్రించుచున్న నన్ను లేపి, రాజాజ్ఞగాఁ దెలియఁజేసి, నీకీలేఖ నిచ్చిరమ్మని పుత్తెంచిరి (అని లేఖ నిచ్చును.)

మీరా :—(లేఖంబుచ్చుకొని విప్పి)

"మీరా!

నీవు పాపాత్మురాలివి—సుక్షత్రియవంశమునఁ దప్పఁబుట్టితివి—నీయునికి పుట్టినింటికిని మెట్టినింటికినిగూడ నపకీర్తిం గలుగఁజేయును. అద్వితీయ సౌందర్యవతివిగదా నన్ను సంతోషపెట్టలేకుండువాయని నిన్నుఁ జేపట్టి వంచింపఁబడితిని. నీకును సోమదత్తునకును గల సంబంధమును నేను కన్నులారఁ గాంచితిని. అన్యులపై నీకభిలాషయున్నది కాని, నిన్నుఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రేమించినభర్తపై లేదు—పొద్దుపొడుచుటకుఁబూర్వము నీవు చిత్తూరువిడిచి నీయిష్టానుసారముగఁ బొమ్ము. స్త్రీహత్య మహాపాతకమనితలంచియు నాదినుండియు నీయపూర్వ సౌందర్యంబునకు ముగ్ధుడనగుటచేతను—నిన్నుఁ జేతులారఁ జంపుట కంగీకరింపకుంటిని—లేకున్న మదీయ ఖడ్గధారకు నిన్ను బలియీయవలసినదే! నీకిఁక నా దర్శనము దొరకదు—నీవు చిత్తూరులో నీజన్మమధ్యమున గాలిడరాదు.

ఇట్లు

కుంభుడు"

నళి :—(కన్నుల నీరునించుచు)

మీరా :—(దుఃఖించుచు) హా! తండ్రీ! రంగా! నేనేమి పాపముచేసితిని? నావలన నేయపరాధముగలిగినది? అది యిదియు ననేమికర్మమో! నిందాపాత్రనై యపకీర్తినేపొందుచున్నానుగదా! నాఁడు తండ్రి నన్ను దుశ్శీలగా శంకించినాఁడు—ఇపుడు నేఁడు పెండ్లియాడినభర్త యను మానించి యీ శిక్ష విధించినాఁడుగా కేదికర్తవ్యము? నాధునొక్కపరి సందర్శించి నానిర్దోషిత్వమును వెల్లడించుకొనుటకయిన నవకాశము లేకపోయెఁగదే!..... ప్రభూ! పండరినాథా! ఆదిని నిన్నే వరించియుంటచేత నన్యుని జేపట్టుట కంగీకరింపలేదు—కారణాంతరముచే వివాహమయినను—ఈ నాశరీర మింతవఱకుఁ బవిత్రమే! ఇద్దానిని నీకొఱకే భద్రముగ నుంచితిని. అనాఘ్రాణిత పుష్పమువలెనున్న మదీయదేహమును నీవే ముట్టవలయును కనుక నీయర్ధరాత్రముననే నాధుని యాజ్ఞను దలఁదాల్చి యీ పుంతిపురిని పాండురంగ పాదారవిందములను భజించుచు మార్గముఁబట్టి పండరిం జేరఁబోయెదను అక్కడ నీ కీతనువు సమర్పించెదను.

నళి :—అమ్మా! ఏమి యీసాహసము! చూడుము. ఆకసమునఁ గాఱుమబ్బు లుదయించినవి అంధకారము నల్గడలఁ గ్రమ్ముకొనియున్నది. తెరువయినఁ గంటికగపడదు ఇట్టిసమయమున నబలవగు నీవొంటరిగఁ బోఁగలవా?

మీరా :—నళినీ!

గీ॥ తల్లియును దండ్రియును దాత ♦ త్రాతనేత
గురుఁడు దైవంబు హితుఁడు సో ♦ దరుఁడు నగుచుఁ
బాండురంగఁడే యెప్పుడు నా ♦ యంతనుండఁ
దోడు నీడేల? వెలుఁగేల? ♦ తోడవులేల?

నళి :—(స్వగ) ఆహా! నిశ్చయముగా నీమె పరమభక్తురాలు—దేవతాస్వరూపిణి! పాదుముండయగు సుగుణాబాయితో నేకీభవించి

రత్నహారమును దొంగిలించి యామె కిచ్చితిని. ఆమె దాని నాధార ముగాఁగొని యీమె యెడల నేరారోపణ మొనరించియున్నఁ బాప మంత యు నాదే!

మీరా :—నళినీ! నేను నా తండ్రిగారి భవనమునుండి కొని తెచ్చిన వెండిబంగారునగ లనేకములీ మందిరమునను న్నవి. నీవు వానిని గైకొనిపొమ్ము. మందసములందుఁ గ్రొంగ్రొత్త చీరలున్నవి — నీవు వానిని బట్టుకొని పోయి కట్టుకొనుము - నా కేమియువలదు - నేఁటికి నా బంధనములు విడిపోయినవి భూస్థలింగల పేదజనులలో నేనొక తె నయితిని నాకీ పాండురంగని ప్రతిమ యొండున్నఁజాలును - నీవుమా త్రము నా యందు దయయుంచి నా నాథుని దర్శించి—

సీ॥ కలనైన, లేక యా ♦ టలనైన నన్యుల
నెనను దలంచలే ♦ నెఱుఁగనుము
త్రికరణంబుల నీమఁ ♦ బ్రేమించియుంటచే
భక్తిభావంబునఁ ♦ బ్రబలితనుము
తుచ్ఛమౌ కామంబు ♦ నిచ్ఛఁజేయమిఁదన
కోర్కు లీడేర్ప లే ♦ కుంటిననుము
అవినీతికార్యంబు ♦ లాచరింపక, సదా
సత్పథంబులఁబట్టి ♦ చనితిననుము

గీ॥ విధివశంబున నపవాదు ♦ పృథ్వినాకుఁ
గలిగెననిచెప్పి; నా నాథు ♦ లలితపాద
పద్మయుగళంబునకు మ్రొక్కి ♦ స్వాంత
మందు దాని మరువకుంగు ♦ ననుము నీవు

ఇఁక నా కనుజ్ఞయిమ్ము - పోవుచున్నాను.

నళి :—(దుఃఖించుచు) హా తల్లీ! తల్లిదండ్రులున్నారు - చెలి కత్తె లెందరోయున్నారు - వా రెవ్వరికిఁ జెప్పకుండ నీ నిశీథసమయ

మున నొక పూతికపుల్లయయినఁ జేతంబట్టకుండఁ బయనమైన నీవు పోవలయునా? ఎంతపాప మెంతపాపము!

మీరా :—(మందహాస మొనరించి) నళినీ!

సీ॥ పండరీనాథుని ♦ భజన కేఁగుచునుండ
నత్తమామల యాజ్ఞ ♦ లందనేల?
విఠల దేవుని కీర్తి ♦ వినుతింపఁబోవుచు
నన్నదమ్ములఁ బ్రశ్న ♦ లడుగనేల?
కస్తూరిరంగని ♦ గన్గొనఁ వెడలుచుఁ
దల్లిదండ్రుల చెంతఁ ♦ దడయనేల?
శ్రీవల్లభుని భక్తి ♦ సేవింపఁ గోరుచు
బంధుమిత్రులతోడ ♦ సమయనేల?

గీ॥ జంబుగోపికలు విడనాడి ♦ స్వాంతమందు
"స్వామి! నన్నేలు! నన్నేలు!" ♦ ప్రేమతోడ
ననుచుఁ బాడుచు నాడుచు ♦ నరుగరాదె?
తోడు నీడేల? ధనమేల? ♦ తోడవులేల?

అమ్మా! నళినీ! నాకిఁక సెలవు—(నిష్క్రమించును)

నళి :—(దుఃఖించుచు) అయ్యయ్యో! తుచ్ఛురాలనై - సుగుణాబాయి యొసంగు లంచముల కాశించి యెంతపాప మొనరించితిని! ఒకవేళ మహాభక్తితో సోమదత్తుఁడీ సాధ్వికొసఁగిన రత్నహారమే రాణా యనుమానమునకు హేతువయిన నిఁక నా గతియేమి? నా పాపమునకు నిష్కృతియుండదుగదా!...... సరియే—రోగమున కౌషధమువలెఁ బాపమునకుఁ బశ్చాత్తాపమే శరణ్యము! నేను మీరాబాయికి విధింపఁబడిన శిక్షయందలి యథార్థమరసి పిమ్మట మహారాజును సందర్శించి నే నెరిఁగిన నిజమును విన్నవించెదను. (నిష్క్ర—)

తెర వ్రాలును.

పంచమాంకము సంపూర్ణము.

శ్రీరస్తు.

# మీరాబాయి

## షష్ఠాంకము.

మొదటిరంగము—

(ప్రవేశము—సుగుణాబాయి.)

సుగు:—(స్వ) నేఁడుగదా లబ్ధవిజయనయితిని! నేఁడుగదా నాకనంతమగుసంతోష సాగరమున సంతరిల్లినది! నేఁటితో నంతః పురమునకుఁగలపీడ వదలిపోయినది. మీరాబాయి నిశీథముననే రాణి వాసము వీడిపోయినది. ఇప్పటికిఁ జిత్తూరుపొలిమేరలనుగూడ దాటి పోయియుండును. శని వదలిపోయినది. ఇఁక నాకు హాయిగా నిద్రపట్ట గలదు. (మీరానుద్దేశించి) ఓసీ! మీరా! ఇప్పుడైనను గ్రహించి తివా సుగుణాబాయియొక్క సామర్థ్యము! పులిమీసములతో నుయ్యాల లూఁగనారంభించితివి. తుదకు నీవు త్రవ్వుకొన్నగోతిలో నీవే పడితివి. మహారాజుగర్భమున నుద్భవించియుఁ జిత్తూరురాణాను జేపట్టియు—నావిరోధమూలమున నేఁడిట్టి యిడుమలఁ గుడుచుచుంటివో! పలుమారులు మెల్లఁగఁజెప్పఁగావింటివికాదు—పాడుభజనలు మానుమనఁగా—శ్రీరంగనీతులు నుడివితివి. నగరునుండి వెడలఁగొట్టఁబడిన నీకిప్పుడే దేవుఁడు తోడ్పడునో చూచెదఁగాక! (ఇంచుకసేపాగి) కారణమేమియో సరిగ నూహింపఁజాలను—కాని—రాణా మిక్కిలి చింతాక్రాంతస్వాంతుఁడై యున్నాఁడు. ఆమెవలనఁ దనకుఁగలిగిన యపఖ్యా

తికి విచారించుచుండవోవు!... (ప్రక్కకుఁజూచి) పుట్టాసింగు రాజసందర్శనముసేసి యిటు వచ్చుచున్నాడు. వానినడిగినఁ గొన్నివిషయములు తెలియఁగలవు.

(అపుడు పుట్టాసింగు ప్రవేశము)

పుట్టా :—(సుగుణాబాయినిజూచి తనలో) ఇదిగో! ఈ పాపముండ యిక్కడనే యున్నది. పరమభక్తురాలగు మీరాబాయికి వ్యాప్తి చెప్పించినది. కొంపకుఁ జిచ్చుపెట్టినది.

సుగు :—పుట్టాసింగూ! రాణాయిప్పుడెక్కడ?

పుట్టా :—మందిరములో నున్నారు—నళినితోను సోమదత్తునితోను మాటలాడుచున్నారు.

సుగు :—(తొట్రుపాటుతో) ఎందులకు? ఏవిషయమును గురించి?

పుట్టా :—యదార్థమునుగురించి—మీరుపన్నిన కపటతంత్రమునుగురించి—మీరుచేసిన మోసమునుగురించి—తెలిసినదా?

సుగు :—పుట్టాసింగూ! నీవెవరిసమ్ముఖమున మాటలాడుచున్నావో యెఱుఁగుదువా?

పుట్టా :—ఎఱుఁగకేమి? పరమభక్తురాలగు మీరాబాయిని బాధలందఁజేసిన వంచకురాలికట్టెదుట—భక్తితో మాతగాభావించి సోమదత్తుఁడిచ్చిన రత్నాలహారమును నళినికిలంచమిచ్చి సంగ్రహించిన మోసకత్తెకట్టెదుట—ఊరిలో లేని సోమదత్తుని మీరాబాయిమందిరములో నామెతోఁగలసియున్నట్లు కల్లలుపల్కిన మహాపాపాత్మురాలి కట్టెదుట—అహాహా—అహాహా—అహాహా నీయధికార మంతరించినది. అసత్యమెన్నఁటికిని దాగదు. నన్నుఁబోయి దయానందయోగీంద్రుని జెఱనుండి విడిపించి తీసికొనిరావలసినదిగా రాణావా రాజ్ఞాపించిరి. నేను పోవుచున్నాను. పశ్చాత్తాపముబొంది చేసిన మహాపరాధము

నొప్పుకొన్నందులకు నళినిని మహారాజుగారు క్షమించిరి. కాని యాది నుండియు నాటకమాడించినందులకు నీగతి యేమగునో!

సుగు:—(స్వగ) ఇఁక నా కాయువుమూడినది. రాణాయొక్క ఖడ్గమున కేఁగ నేల? నా యంత నేనే యిప్పుడునూతంబడి ప్రాణత్యాగ మొనరింతును.

(నిష్క్రమించును.)

పుష్టా:—ఇట్టి కుటిలచిత్తలుండుటచేతనే, భారతావని నానాఁటికి స్త్రీయశక్తి నుఁగుచున్నది అమాయకురాలగు మీరాదేవి నీమె సాదించినది-దూషించినది-ఆమెచేసిన సత్కృతులను రోసినది. రోయుటమాత్రమే కాదు పుల్లలుపెట్టి రాణామనస్సుం జెఱచినది. అసత్య మెంత కాలముదాగును? అధర్మ మెంతవఱకునిలుచును? రాణాకూడ నేఁడు వికలచిత్తుఁడై సర్వకాలసర్వావస్థలయందు—"హా మీరా!" యని యామెనే స్మరించుచున్నాఁడు

(నేపథ్యమున—)

"అయ్యో! అయ్యో! సుగుణాబాయి నూతిలోఁబడినది"—

పుష్టా:—(ఆలకించి) ఆఁ-ఆఁ-నూతిలోఁబడినదా? సుగుణా బాయియా? (పఱుగిడిపోవును.

తెర వ్రాలును.

---

## రెండవరంగము.

(ప్రవేశము—విచారగ్రస్తుఁడై కుంభుఁడు)

కుంభ:—హా మీరా! మీరా! బుద్ధిహీనుఁడనై-గర్వాంధకార పరిమత్తహృదయుఁడనై నిన్నుఁ గోల్పోయితిని. ఆపాడుముండ

మాటలను వింటిని. సత్యము విదితమైనంతనే తన్ను నేనెక్కడకిడ్చి తునోయని యామె నూతంబడినది......అయ్యో! నివంటిసౌందర్యవతి—నిన్నుఁబోలిన భర్తృరాలు—నాకెట్లులభించును? అక్కటా! నీ దివ్యమంగళవిగ్రహమును కన్నులారా సందర్శించుభాగ్యము నాకు లేదా? అబ్బా—బాధ—తాపము—హా! మీరా! మీరా! నీముఖ బింబమునుగాంచినపుడే కందర్పుఁడు నాహృదయములోఁ బ్రవేశించి నాఁడు—స్థిరనివాసమేర్పఱచుకొనినాఁడు వాఁడితూపులచేఁ బొడిమిఁ దూల్చుచున్నాఁడు (మన్మథునుద్దేశించి) ఓరీ మదనా! ఏల నాతో వృథావివాదముఁ దెచ్చిపెట్టుకొందువు? యజనిర్మాణకళాకౌశల్యముం బ్రకటించుకోనగలాంగి—నామీరా—ముద్దులమీరా—యుండగా నీయాటలు నాయొద్దసాగునా?......మీరా! మీరా! రమ్ము. త్వరితగతినిరమ్ము. లడయమము మదనుఁడు గర్వితుఁడై విజృంభించుచున్నాఁడు. వీనిపొగరుఁ గట్టింపవలయును. ఆలస్యముసేయుకుము రమ్ము అబ్బా—పిలుచుచుగానే రావేమి? నన్నుడ్వింప జూచుటకు నికిది సమయము? పోనిమ్ము-మీరా! నీవురాకున్న నేనేమిచచ్చెదను. (ముందునకుఁబోయి) ఎక్కడుంటివి? ఆఁ-ఇక్కడున్నావు! ఏమి నన్నుఁజూచి పాఱిపోవుచుంటివా? అబ్బా—నీకేంత బెట్టెందులకు? మనమిరువురము గలసి పోరాడినఁగాని—రతిరాజు పరాజితుఁడుకాఁడు ఏమి? నన్నుఁ జూచి పాఱిపోవుచున్నావా? (రెండడుగులు ప్రక్కకిడి) ఈమూల దాగియున్నావా? అహో! ఏమినీమాయ! మెఱపుఁదీగవలె నొకపరి కన్నులకుఁ బొడసూపి యంతలోనే యదృశ్యవగుచున్నావు! ఆఁ—దొరకితివి. ఇఁకఁ బట్టుపడితివి- నీ కుసుమకోమలదేహము నా బాహువులలోఁ జిక్కినది—నీచెక్కుటద్దములతో నావేళ్లు సయ్యాటలాడఁగలవు. నీయధరసుధారసం బాస్వాదించి నాయపరిమిత దాహతృష్ణఁ బాపుకొందును. అపుడేమిసేయుదువు? రమ్ము. రమ్ము ముద్దిమ్ము

(అని చేతులుచాచి ముద్దిడుకొనఁబోయి క్రిందఁబడి) హా! ఏమిది? నామీరా నాకౌఁగిటలేదా? లేదా? హా మీరా! మీరా! నా యందు నీకాగ్రహమా? లేక పరాకా?. పాండురంగనియందలి భక్తిచే నన్ను మరచిపోయితివా? ఒక్కపరి—ఒక్కపరిచాలును—నీ మనోమోహనవిగ్రహమును నాకుఁజూపుము. చూపవా? నన్నుదుఃఖ పెట్టుట నీకు న్యాయమా? రంగా! పాండురంగా! నీకింతస్వార్థమెం దులకయ్యా? నీవయిన నామెతోఁ జెప్పరాదా? చెప్పి నాకోర్కి తీర్పరాదా?......... హా! మరచితిని. మతిభ్రమణముచేఁ బలవ రించుచున్నాను—నామీరా యీ నిశీథముననే బయలుదేఱి పండరికిఁ బోయినదని చెలికత్తెయగు నళిని చెప్పినదిగదా! (స్మృతినభినయించి) అవును తప్పక యామె పండరిలోనే యుండును. నేనిప్పుడే దయా నందయోగిని సందర్శించి, అమ్మహాత్మునితోఁ బండరికేగెదను. ఆలస్య మేల? యోగిపుంగవుం గలసికొందును.

(నిష్క్రమించును.)

తెర వ్రాలును.

---

మూఁడవరంగము—పండరీపురమునఁ బాండురంగాలయము.

(ప్రవేశము—పాండురంగనివిగ్రహముమ్రోల మీరాబాయి.)

మీరా:—(అంజలిఘటించి) హే దీనమందారా! హేభక్త జనబంధూ! హే కరుణాసింధూ! హే సనకసనందనాది మునిగణ సేవితా! హే బృందారకవందిత సుందరచరణారవిందా! హే దుష్ట శిక్షణ శిష్టరక్షణ దీక్షాదక్షా! హే కోటిసూర్యప్రభా భాసితా! హే

మానితాకారా! హే నిర్వ్యాజకృపాలహరీ! హే శ్రీరంగా! హే రంగా! హే పాపభంగా! హే శుభాంగా! పాహిమాం-పాహిమాం రంగా! పాండురంగా!

సీ॥ నీనామపఠనంబు ♦ నిఖిలపాపమదేభ
గణముభేదించు సిం ♦ గంపుఁగోదను
నీపదాంబుజసేవ ♦ తాపత్రయాలశీల
దావాగ్నిఁజల్లార్చు ♦ తేటిజలంబు
నీప్రాపునఁ బడా ♦ నీకారణమమాచ్చు
వేల్పువాకిటయుండు ♦ నెలయుచెట్టు
నీదర్శనం బతి ♦ నిర్మలాత్ములు గోరు
ముక్తిసాధమునకు ♦ మొదటిమెట్టు

గీ॥ త్రికరణంబులచేతను ♦ దృఢతరముగ
నిన్నె ప్రేమించియుంటిని ♦ నెమ్మనమున
ఒరులు ముట్టఁగ లేదు నా ♦ యొడలు-దీని
నైక్యమొనరించుకొమ్ము నీ ♦ యందురంగ!

(అనుబంధము—)

(భక్త్యావేశముచే భజనసేయుచుఁ గ్రిందఁబడి ప్రాణములు విడుచును)

తెర వ్రాలును.

---

నాల్గవ రంగము—పండరీపురప్రాంతము.

(ప్రవేశము—కుంభుఁడు—దయానందుఁడు)

దయా:— మహారాజా! చూచితివా?

మ॥ అదిగో! శంకరీ! భక్తబృందమదిగో! ♦ ఆనందమింపొందఁగా
బదముల్ పాడుచుఁ బాండురంగ ప్రభువున్ ♦ బల్మాఱుపేక్షించుచున్
ముదితోత్సాహముతోడ నర్చనలు సం ♦ పూజ్యస్థితిం జేయు నా
య్యదె! పుణ్యాంచితదృశ్యరాజము;సుఖ ♦ వ్యాపారసుశ్రేయమున్!

కుంభు :—మహాశయా! పరమపవిత్రంబై. పుణ్యక్షేత్రంబు లలో నగ్రగణ్యమగు న పాండురంగనిలయమగు పండరీపురముం బ్రవేశించితిమిగదా! ఇపు డాలయములోని కేఁగి మీరాబాయిజాడలఁ దెలియవలయును.

దయా :—(మందహాసముతో) వెఱ్ఱివాఁడా! భవపాశమునఁ దగుల్కొనెద వేల? పాండురంగసందర్శనముకన్న భార్యాసందర్శనము నీకత్యంత సంతోషదాయకమా?

కుంభు :—(ప్రక్కకుఁజూచి) ఆర్యా! ఆభజన లేమి? ఆజన సమూహము లేమి? -కోలాహలమేమి?

దయా :—(పరికించి) రాజా! ఎవ్వఁడో యొకపురుషుఁడటు పోవుచున్నాఁడు వానినడిగి తెలిసికొనుము.

కుంభు :—(ముందునకేగి) అయ్యా! ఆజనసమూహమేమి? ఆభజనలేమి? తెలియఁజేసి నన్ను గహింతురా? (వినుటనభినయించి) ఆఁ-ఏమనుచున్నారు? ఎవ్వతెయో యొకసాధ్వీమణి పాండురంగనిలో నైక్యమందుటచే, భౌతికంబగు నామె దేహము నూరేగింపుఁ దీసికొనిపోయి భూస్థాపిత మొనరించుచున్నారనియా? (దయానందునుద్దేశించి) స్వామీ! దయానందా! ఆస్త్రీమూర్తి యెవ్వరో తెలిసికొనవలయును. ఏలకో నాచిత్తము తత్తరపడుచున్నది. త్వరితగతిని రండు.

(ఇరువురు నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

ఐదవ రంగము—పాండురంగాలయము

(ప్రవేశము–మూర్ఛితుఁడయి కుంభుఁడు—శైత్యోపచారము లొనరించుచు దయానందుఁడు)

దయా :—(స్వగ) పరమభక్తురాలు మీరాబాయి! కనుకనే జన్మరాహిత్యముం బడయఁగల్గినది! మహామునులకుఁగూడ దుర్లభం బగు పదముం బొందఁగలిగినది. పరమేశ్వరునిలో నైక్యము చెందుట సామాన్యులకు వశమా? ఈతఁడు మోహావిభ్రాంతుఁడగుటచే నిట్లు మూర్ఛ మునింగినాఁడు.

కుంభు :—(మూర్ఛ లేచి) హా! మీరా! మీరా! ఇఁక నిన్నుఁ జూచుభాగ్యము నాకిఁకన్నను లేదా?

దయా :—రాజా! ఓడిల్లుమూడిల్లును.

కుంభు :—అయ్యో! దయానందా! నిర్భాగ్యుండనగు నా కింక నూఱట యెట్లుగలుగును?

గీ॥ నాదుభాగ్యము జీవము ♦ నాదుహృదయ
మైన నాసాధ్వి ననుబీడి ♦ యరిగెనేఁడు
ఆమె లేకున్న నేనెట్లు ♦ లవనియందు
బ్రతుకఁగలవాఁడ! చెప్పుమా! ♦ పరమపురుష!

దయా :—(మందహాసముతో) నాయనా! ఆమె పాండురంగనిలో లీనమయినది. అందులకు నీవు సంతోష మందవలసినదే కాని, విచార మందఁబనిలేదు. నేనొక విషయమును జెప్పుచున్నాఁను విను. లోకములో నొకనికి నింకొకనికి శాశ్వతమగు సంబంధమేదియు లేదు. అందఱకు బంధువగువాఁడా పాండురంగఁడొక్కఁడే!... నాయనా! ఇంతవఱకు నీహృదయ మజ్ఞానాంధకారావృతమైయున్నది

జ్ఞానదీపకమును బ్రికెశెట్టుము. సంసారమనుచెఱసాలయం దాలుబిడ్డలనుతాళ్ళచేఁ గట్టఁబడి మోహావిష్టులగు మనుజులకు మోక్షము లేదు. అట్టివారిజన్మము నిష్ఫలము. భవబంధములకుఁ జిక్కుపడక భక్తితోఁ బాండురంగని భజించు మహాత్ములే చరితార్థులు! మీరాబాయిలోఁగల సౌందర్యమునుఁజూచి మోహింపఁగలితివేకాని భక్తిని గ్రహింపలేకపోయితివి నేఁడామె నీకు మార్గదర్శినియైనది. ఆమె యెట్లు జితేంద్రియత్వ మలవఱచుకొని, మహోత్కృష్టపదవిం బొందినదో నీవు గ్రహింపుము శ్లాఘ్యము సంతోషదాయకమునగు నట్టిమార్గమునే నీవుకూడ ననుసరింపుము. అంతియేకాని—

ఉ. శాశ్వతమంచు దేహములు ♦ శాశ్వతమంచు ఆలుబిడ్డలున్
శాశ్వతమంచు భోగములు ♦ స్వాంతమునం దలపోసి భక్తిమై
శాశ్వత రంగనామమును ♦ సంస్మరణంబును జేయకుంట చే
శాశ్వత సౌఖ్యదాయకము ♦ సద్గతికల్గునె యెన్నఁడేనియున్ !

కుంభు :—(దయానందుని పాదములపైఁబడి) మహాత్మా! నీయాజ్ఞను దలఁదాల్తును నీవు బోధామృతముం బ్రసాదించి హృదయపరివర్తనముగల్పించి, నన్ను ధన్యునిం జేసితివి. నీవుచెప్పినచొప్పున భక్తురాలగు మీరాబాయిని హృదయమునందిడుకొని నిన్ను గురుదేవునిగ భావించి విషయభోగములుండనుగాక, ముప్పొద్దులందు నా పాండురంగని పాదారవిందములనే భజింతును

దయా :—అయిన నీకుఁ గావలసిన దేమున్నది?

కుంభు :—మహాత్మా! అవ్యాజంబగు కరుణాతిశయముం జూపి నన్నుద్ధరించితివి—నా యజ్ఞానమును రూపుమాపితివి—నాకుఁ దరుణోపాయ మెఱిఁగించితివి. మీరాబాయినామము శాశ్వతముగా నుండునటులఁ జిత్తూరులో నొకమందిరము నిర్మింపవలయును ఇదె నాతలంపు. గావలసిన దేమున్నది? అయిన నిట్టులగుఁగాక !

సీ॥ ధర్మపాలనమున రాజు • దనరుఁగాక !
సర్వలోకేశు మెప్పించు • శక్తి భక్తి
స్త్రీ పురుష బృందమందునఁ • జెలఁగుఁగాక
పృథ్వి ధనధాన్యసమృద్ధి • వెలయుఁగాక !

దయా :—తథాస్తు ! తథాస్తు !! తథాస్తు !!!

సౌర ప్రావాలుడు

---

షష్ఠాంకము సంపూర్ణము.

